Regd No. M. 1118.

10 పేజీలు 2 అణాలు

# ఆంధ్రపత్రిక

Founder: K. NAGESWARA ROW. SUNDAY EDITION.

Vol. 36. ANDHRA PATRIKA, MADRAS. 24th APRIL 1949 No. 23



# చైనా రాజధాని నాన్కింగ్‌లో కమ్యూనిస్టు సేనల ప్రవేశం

## నగరంనుండి ప్రభుత్వ ఉద్యోగుల ఖాళీ

### తుదివరకూ పోరాటం జరపాలని చాంగ్ కై

## షేక్ ప్రభుత్వ నిర్ణయం

### యాంగ్సీ ఒడ్డున ప్రభుత్వ రక్షణ శ్రేణుల విధ్వంసం

నాన్‌కింగ్, ఏప్రిల్ 23: ఈ వేళ తెల్లవారు ఝామున కమ్యూనిస్టు సేనలు చైనా రాజధానియైన నాన్‌కింగ్ నగరంలో ప్రవేశించినవి.

బాధ్యత గల చైనా ప్రభుత్వోద్యోగులు యావన్మందీ యీ సరికే రాజధాని నుండి తరలిపోయినట్లు తెలుస్తున్నది.

యాంగ్సీ నది ఒడ్డు పొడుగునా చైనా ప్రభుత్వ సేనలు నిర్మించుకొన్న రక్షణ శ్రేణులు పూర్తిగా నాశనమై పోయినట్లు నాన్‌కింగు వార్తలనుబట్టి తెలుస్తున్నది.

పట్నంలో శాంతిభద్రతలు కాపాడుతూ వచ్చిన ప్రభుత్వ సైనిక దళాలూ, పోలీసు దళాలూ, కడచిన అర్ధరాత్రిని, పట్నాన్ని విడిచివెళ్లి పోయారు. అందికో సంజనం ఎగబడి ఇళ్లల్లో దుకాణాలలోనూ దూరి లూటీలు చేశారు. నాన్‌కింగ్ మేయర్ యిల్లు తలుపులూ దరవాజాలు మిగిలినై.

కమ్యూనిస్టుదళాలు నాన్‌కింగ్‌కు 75 మైళ్ళ అగ్నేయంగావున్న వూ - ఇష రైల్వే కేంద్రాన్ని సమీపిస్తున్నట్టు వార్తలు వస్తున్నయ్. ఈ కేంద్రం కమ్యూనిస్టుల స్వాధీనమైతే, షాంఘైతో గల రైల్వే సంబంధం తెగిపోతుంది.

శాంతి సంప్రదింపులు భగ్నమైపోయిన

(2-వ పేజీ చూడుడు)

## 'స్వాతంత్ర్య రిపబ్లికన్ హోదాకు భంగంరాని పద్ధతిన కామన్వెల్తుతో సహకారం'

### భారత దృక్పథాన్ని వివరిస్తూ తొలి సమావేశంలో నెహ్రూ ప్రసంగం

### సోమవారానికి సభాకార్యక్రమం వాయిదా

లండన్, ఏప్రిల్ 22: భారత రిపబ్లిక్‌కు కామన్వెల్తుతో ఉండగల సంబంధాల కొక సమగ్ర స్వరూపమును నిర్ణయించడానికి ఇచ్చటికి విచ్చేసిన అధినివేశ ప్రధానులు నేడు 10 డౌనింగు వీధిలో రహస్యసమావేశాన్ని ప్రారంభించారు. బ్రిటన్, ఇండియా, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజీలండ్, పాకిస్తాన్, సింహళం, దక్షిణాఫ్రికాల ప్రముఖ రాజనీతిజ్ఞులు ఈ చర్చలలో పాల్గొంటున్నారు. వీరి చర్చలే సఫలమయితే, వారం రోజులలోగా కామన్వెల్తు స్వరూపమే సంపూర్ణంగా మారిపోయే అవకాశం ఉన్నది.

ఈ సమావేశాన్ని ప్రారంభిస్తూ ప్రధాని అట్లీ సమావేశ ఆశయాలను సూత్రప్రాయంగా వివరించాడు.

నేటి ఉదయపు సమావేశంలో పండిత నెహ్రూ తన దేశపు పరిస్థితిని వివరించి, తమ రిపబ్లిక్ హోదాకూ, స్వాతంత్ర్యానికీ భంగం కలగని పద్ధతిలో కామన్వెల్తుతో సహకరించటానికి సంసిద్ధులై ఉన్నామని చెప్పినట్లు తెలుస్తున్నది.

ఈ సమావేశం నేటి ఉదయం 11 గంటలకు బ్రిటిష్ ప్రధాని నివాస భవనంలో బ్రిటిష్ మంత్రివర్గం సమావేశాలు జరిగే హాలులో జరిగినది. సమావేశం ప్రారంభంకావటానికి ఒక గంటముందు ప్రధాని అట్లీ ముఖ్యమైన బ్రిటిష్ మంత్రులతో ఈ విషయమై చర్చించెను.

### రెండో సమావేశం

నేటిరాత్రి బ్రిటిష్ ప్రధాని నివాస భవనంలో కామన్వెల్తు ప్రధానుల రెండవ సమావేశం జరిగినది. ఈ సమావేశంలో 3 గురు ప్రధానులు మాత్రమే పాల్గొన్నారు, ఇండియా, కెనడా, దక్షిణాఫ్రికాల ప్రధానులుతప్ప మిగిలిన అయిదుగురూ సమావేశమై, కామన్వెల్తు సంబంధాలలో బ్రిటిష్ కిరీటానికి ఉండవలసిన ప్రాముఖ్యత విషయమై ఆస్ట్రేలియా, న్యూజీలాండ్‌ల వరతులను చర్చించారు.

8 మంది ప్రధానులు పాల్గొనే మరొక సమగ్రసమావేశం సోమవారంమధ్యాహ్నం జరుగుతుందని సూచించబడినది.

ఉదయం జరిగిన సమగ్ర సమావేశానికీ సాయంత్రం జరిగిన ఈ సమావేశానికీమధ్య వ్యవధిలో పండిత నెహ్రూ ప్రధాని అట్లీని కలుసుకుని దీర్ఘ సంభాషణలు జరిపెను.

నేటి ఉదయపు సమావేశంలో పండిత నెహ్రూ తన దేశపు పరిస్థితిని వివరించి,

(2-వ పేజీ చూడుడు)

## 29 న భోపాల్‌కు వి. పి. మీనన్ ప్రయాణం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 22: భారతప్రభుత్వసంస్థానశాఖా సలహాదారుడు వి. పి. మీనన్ ఏప్రిల్ 29 వ తేదీన భోపాల్‌కు వెళ్లుతున్నారు. లోగడ నవాబ్‌తో కుదిరిన ఒడంబడికను పరిపూర్తిచేయుపనిమీదనే మీనన్ అక్కడికివెళ్లుతున్నది. లోగడ ఒడంబడిక ప్రకారం నవాబ్, తన సంస్థాన పరిపాలనాధికారాన్ని భారతప్రభుత్వానికి వప్పగింతపెట్టుటకు అంగీకరించిన విషయం పాఠకులకువిదితమే.

కేంద్రప్రభుత్వంచే నియోగింపబడు చీఫ్ కమీషనర్, యేతేదీన సంస్థాన పరిపాలనాధికారాన్ని వశం చేసుకునేది, నవాబ్‌తో మీనన్ సంప్రదింపులు అనంతరం ప్రకటింపబడును.

### బొంబయికి మీనన్‌రాక

బొంబయి, ఏప్రిల్ 22: బరోడా యువరాజు ఉదయసింగ్ జీ, భారత సంస్థానశాఖా సహాయ కార్యదర్శి యస్. యం. బూచ్‌గారలతో కలసి, వి. పి. మీనన్ సిరోహీనుంచి ప్రత్యేక విమానంలో బొంబయి వచ్చారు.

## యుద్ధం అమెరికాను సమీపిస్తున్నది

### మాజీ అమెరికన్ రాయబారి బుల్లిట్ హెచ్చరిక

వాషింగ్టన్, ఏప్రిల్ 22: "యుద్ధం అమెరికాను దాపురిస్తున్నదనే సంగతి దురదృష్టవశాత్తూ సుస్పష్టముగా గోచరిస్తున్నది." అని యిదివరలో మాస్కోలో అమెరికా రాయబారిగా పనిచేసిన విలియం బుల్లిట్ నేడు కొన్సెన్ విశ్వవిద్యాలయంలో ఉపన్యసిస్తూ ప్రకటించాడు. మానవజాతి సంబంధాలు అనే విషయంపై యీ విశ్వవిద్యాలయంలో వరుసగా ఉపన్యాసాలు జరుగుచున్నవి. ఈ ఉపన్యాసాలు ప్రారంభమై యిది నాల్గవ సంవత్సరం.

క్రితం యుద్ధం లగాయతూ అమెరికా అనుసరిస్తున్న విదేశాంగ రాజనీతిని బుల్లిట్ విమర్శించాడు.

"సత్సంకల్పాలు ఉన్నప్పటికి వాస్తవిక విషయ పరిజ్ఞానంలేని కొత్తవారికి విదేశాంగ వ్యవహారాలను వప్పగింతపెట్టుట అమెరికాలో ఆచారమై పోయింది. తత్ఫలితంగా శాంతి గమ్యస్థానాన్ని చేర్చే దారిచూపుట, ఘోర నరకపు లోయనుండా పోతున్నది.

ఆసియాలో అంగబలాన్ని అర్థబలాన్ని, తన సమర సంపదను స్టాలిన్ జతకూర్చుకొనుచుండగా ఉపేక్షించుట ద్వారా తృతీయ ప్రపంచ సంగ్రామాన్ని తథ్యం చేస్తున్నాము.

ప్రజాస్వామ్య రాజ్య సహకారాన్ని ఆశించి సోవియట్ సామ్రాజ్యవాదాన్ని స్టాలిన్ త్యజించేటట్లుజేయవచ్చుననే వృథా నమ్మకంతో రూజ్‌వెల్టు సాగించిన పరిపాలనను బుల్లిట్ నిందించాడు.

## తూర్పు పంజాబు సరిహద్దు దాడులు

### పాకిస్థాన్‌కు భారతప్రభుత్వ అధిక్షేపణ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 23: పాకిస్థాన్ దేశీయులు ఏప్రిల్ మొదటివారంలో తూర్పు పంజాబులోని ఫజిల్కా తహసీల్‌లో 3 చోట్ల దాడ్లు జరిపిరనీ, ఈ 3 దాడ్లలోనూ 12 మంది భారతీయులు మరణించిరనీ, 10 మంది గాయపడిరనీ అధికారరీత్యా నేడిక్కడ ప్రకటింపబడెను.

భారత ప్రభుత్వం ఈ దాడులను పురస్కరించుకొని పాకిస్థాన్ ప్రభుత్వమునకు తీవ్రముగా అధిక్షేపణ తెల్పినది. అంతరరాష్ట్ర సమావేశంలో నిర్ణయించిన విధానము ప్రకారంగా ఈ సంఘటనలను దర్యాప్తుచేసి దోషులను యథార్థంగా దండించవలెనని భారతప్రభుత్వం కోరింది.

### పొన్నేరి లోకల్‌లో బియ్యం అక్రమరవాణా

చెన్నపట్నం, ఏప్రిల్ 23: నిన్న పొన్నేరిలోకల్ తిరువత్తియూరుకు వచ్చినపుడు పోలీసులు సోదాచేయగా 441 పళ్ల బియ్యం కదలిపోయబడియుండెను.

## "ఇండొనేసియాపై సమితినిర్ణయం అమలు జరిగేటట్లు చూడాలి"

### అమెరికా అధ్యక్షునకు సెనెటర్ల విజ్ఞాపన

వాషింగ్టన్, ఏప్రిల్ 22: ఇండొనేషియా విషయమై ఐక్యరాజ్య సమితి గావించిన నిర్ణయములను అమలుచేయుటకు చర్యలు గైకొనవలెనని కోరు లేఖ నొకదానిని 23 రిపబ్లికను, సెనెటర్లు ప్రెసిడెంటు ట్రూమన్‌కు వ్రాసియున్నారు. ఐక్యరాజ్య సమితి నిర్ణయములను అమలుచేయుట కవసరమైన చర్యలను వెంటనే గైకొనవలెనని విదేశాంగమంత్రికి, ఐక్యరాజ్య సమితి యందలి అమెరికన్ రాయబారికి ఉత్తరువులు పంపవలెనని లేఖ ట్రూమన్‌ను కోరుచున్నది.

ఐక్యరాజ్యసమితి ఏ డచ్చియులపై చర్య గైకొనుచున్నదో ఆదేశములకు ద్రవ్యసహాయము ఆపుచేయవలెనను షరతుతో సెనేటువారు ఆర్థికసహాయవిస్తరణ బిల్లును ఆమోదించియుండిరి. ఈబిల్లుకు అధ్యక్షుడు ట్రూమన్ అనుమతి యొసంగియున్నాడు. ఇండొనేసియాలో సైనికబలము నుపయోగించి వచ్చినవారు అసమంజసంగాను, ప్రపంచశాంతికి భంగముకలిగించు విధమునను వ్యవహరించి యున్నారు. అదిగాక యుద్ధం ఆపుచేయవలెనని భద్రతాసంఘము కోరిన కోర్కెను శిరసావహింప డచ్చివారు నిరాకరించిరి. ఇండొనేసియా తగాదాను శాంతియుతంగా పరిష్కరించుటకు వారు చర్యలు గైకొనకపోయిరి అని లేఖ తెలుపుచున్నది.

## ఇండో చైనాలోకి చైనా కమ్యూనిస్టుల ప్రవేశం

వాషింగ్టన్, ఏప్రిల్ 22: ఫ్రెంచి ఇండోచైనాలోని తిరుగుబాటుదారులకు తోడ్పడుటకుగాను చైనానుండి కమ్యూనిస్టు సైనికులు ఇండోచైనాలోకి రహస్యముగా సరిహద్దు దాటి ప్రవేశించుచున్నారని ఫ్రెంచి మాజీప్రధాని పాల్ రేనో నేడిక్కడ వెల్లడించెను.

ఇండో చైనాలో జరుగుచున్న సంఘటనలు ఒక్క ఫ్రాన్సుకేగాక, ఇంకా అనేక దేశములకుకూడా ప్రమాదకరంగా తోచజాలవు. సయాం, మలయా, బర్మా, ఇండియా, పచ్చి పూర్వదీవులు అన్నీ జాగ్రత్త పడవలసినదే

## ఈనెలాఖరుతో గాంధీనిధి వసూళ్ల సమాప్తి

### 'ఇంటింటికీ తిరిగి చందాలు పోగు చేయా'లని రాజేంద్రప్రసాద్ ప్రకటన

కాశీ, ఏప్రిలు 22: గాంధీ జాతీయ స్మారకనిధి అధ్యక్షుడు డా॥ రాజేంద్రప్రసాదు, నేడొక ప్రకటన చేస్తూ చందాలు పోగుచేసేవారు ఇంటింటికి తిరిగి వసూళ్లు సాగించాలనీ, ఏప్రిలు 30 తేదీతో వసూళ్లు పూర్తిచేసి ఆ మొత్తాలు వెంటనే బాంకులలో వెయ్యాలనీ అన్నారు.

"వసూళ్లు సాగించడానికి ఒక్క వారం మాత్రమే వ్యవధి ఉంది. నేను వెళ్లినచోటనల్లా చురుకుగా పనిసాగుతూండటం కనిపించింది. చందాలు వసూలు చేసేవారు ఇళ్లిల్లు తిరిగి నట్లయితే వసూళ్లు తృప్తికరంగా ఉండగలవు. కేవలము వసూళ్ళ కొరకే నేనీమాట చెప్పడం లేదు. గాంధీజీ సందేశాన్ని ఇంటింటికీ, ఊరూరికీ తీసుకుపోవడం వసూలుకన్న కూడా అవసరం. స్మారకనిధికిగాను కృషి చేస్తున్న కార్యకర్తలు ఈ వారంలో సాధ్యమైనప్పుడెల్లా బహిరంగసభలద్వారా తమకృషి ఫలితాలను ప్రకటించాలి. వసూళ్లు చేసినవారు ఏప్రిల్ 30 నాటికి తమవద్ద మిగిలి ఉండే సొమ్మును శీఘ్రంగా అధికారం గల బాంకులలో వెయ్యాలి. ఇట్లు చేసినట్లయితే బాంకులు తమవద్ద సొమ్ము ... కేంద్ర కార్యాలయానికి మే 7 తేదీలోగా తెలియజేయగలుగుతారు. గాంధీ స్మారక నిధి మొత్తం గురించి ప్రజలు తెలిసికొన ఆత్రపడుతున్నారు" అని డా॥ రాజేంద్రప్రసాదు ప్రకటించారు.

### ఇద్దరు ముస్లిముల అరెస్టు

చెన్నపట్నం, ఏప్రిల్ 23: మొన్న రాత్రి ... యూసఫ్ (30 యేండ్లు) అబ్దుల్ ... (30 యేండ్లు) అనువారిని ... (వాటిలో కొన్ని ...) ... పోలీసులచే అరెస్టు చేయబడిరి. ... కత్తి ... నొక్కకలవు. ఈ విషయమై దర్యాప్తు సాగుచున్నది.

## ఫ్రెంచిఇండియాతో సుంకముల ఒడంబడిక

పారిస్, ఏప్రిల్ 22: ఇండియాలోని ఫ్రెంచి భూభాగములకు ఇండియాకు మధ్య త్వరలో సుంకముల ఒడంబడిక కుదురగలదని తాము ఆశించుచున్నామని ఫ్రెంచి దేశాంతర భూభాగముల మంత్రి పాల్ కోస్ట్ ఫ్లొరెట్ నేడు ఫ్రెంచి మంత్రివర్గ సమావేశంలో ప్రకటించెను.

## సైన్యమునకు శాస్త్రజ్ఞులు నవీన శాస్త్రజ్ఞానమును అందజేయవలెను

### భారత సర్వసేనాని జనరల్ కరియప్ప ఉద్బోధ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 22: "ప్రపంచము యొక్క ప్రస్తుత పరిస్థితిలో దేశమును రక్షింపకలిగి సాయుధదళములు మాత్రమే. కనుక దేశప్రజలు వారికి ప్రశస్తమైన ఆయుధ పరికరములు అందజేయవలెను. మన దేశములో తెలివితేటలు కలవారున్నారు. ... మనకు కలదు కాని కట్టుదిట్టమైన సంస్థ లేదు" అని దేశరక్షణశాస్త్ర మహాసభలో ఉపన్యసించుచు నేడు భారత సర్వసేనాధిపతి జనరల్ కరియప్పగారు చెప్పిరి. ప్రొ॥ ఎస్. ఎస్. బోసు అధ్యక్షతన మూడురోజులనుండి జరుగుచున్న ఈ సభ నేడు సమాప్తమయ్యెను.

"ప్రస్తుత ప్రతినిధులలోను సాయుధదళముల ప్రతినిధులలోను, పారిశ్రామికుల ప్రతినిధులలోను కూడియున్న సంస్థ మాత్రమే దేశమునకు అత్యంత ప్రయోజనకరముగా నుండును. శాస్త్రజ్ఞులు సైన్యములకు నవీనమైన విజ్ఞానమును, క్రొత్త భావములను అందజేయవలసి యున్నది. రక్షణ ... సమస్యలను శాస్త్రజ్ఞులకు నివేదింతురు." అని సర్వసేనాధిపతి చెప్పెను.

... విమానముల ప్రాముఖ్యమును ... ఎయిర్ కమడోర్ బ్రిటిష్ ఎ. ఎమ్. ... వివరించి చెప్పెను. ... శాస్త్ర పరిశోధన శాఖవంటి సంస్థను స్థాపించుటకు చర్యలు గైకొన బడుచున్నవని ఆ. ... అక్టింగ్ సర్వసేనాపతి కమెడోరు ... గారు చెప్పిరి.

## పారిశ్రామికాభివృద్ధికి ప్రభుత్వ తోడ్పాటు

### డా॥ శ్యాంప్రసాద్ ముఖర్జీ హామీ

బొంబాయి, ఏప్రిల్ 22: భారత ప్రభుత్వ పరిశ్రమల శాఖామంత్రి డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీ నేడిక్కడ (బొంబాయి సమావేశం)లో కమాని కంపెనీ వారి షీట్ రోలింగ్ ప్లాంట్‌ను నేడు ప్రారంభోత్సవం చేస్తూ పారిశ్రామికాభివృద్ధికై పారిశ్రామికులు చేసుకున్న పనకొలకు ప్రభుత్వం పూర్తిగా తోడ్పడ గలదని హామీ ఇచ్చెను. పారిశ్రామికుల కంట్రోలు బిల్లు పరిశ్రమల అభివృద్ధికి కానీ, పారిశ్రామిక తరగతికి కానీ హాని కలుగునట్లు ఎన్నటికీ ఉపయోగించబడదని ఆయన ప్రకటించెను.

"భారత దేశంలో లోహాల కరువు ఎక్కువగా ఉన్నది. నాన్ ఫెరస్ మెటల్ పరిశ్రమ (రాగి, ఇత్తడి, మొ॥)కు దేశంలో చాలా ప్రాధాన్యత ఉన్నది. వీటి విషయమై టారిఫ్‌బోర్డ్ సమర్పించిన నివేదికను ప్రభుత్వం ఆలోచిస్తున్నది. ప్రభుత్వ నిర్ణయం త్వరలోనే ప్రకటించబడుతుంది. విదేశీ పోటీలనుండి భారత పరిశ్రమలను రక్షించటం క్రమంతో కూడుకున్న పని. అయినప్పటికీ దేశానికి అవసరమైన పరిశ్రమలకు సర్వవిధాలా తోడ్పడటానికే ప్రభుత్వం నిశ్చయించినది" అని ఆయన వివరించెను.

"విదేశవస్తువుల పోటీకి తట్టుకొంటూ, భారతపరిశ్రమలు, భారత పారిశ్రామికోత్పత్తి, నిలవబడేటట్లు చూడటం ఎలా అన్నది ఒక సమస్య. పరిశ్రమలకు ప్రభుత్వ రక్షణ యివ్వటం మంచిదే. ఐతే ప్రభుత్వ రక్షణ ఒక్కటే యీ సమస్యను పరిష్కరింపజాలదు. మనం నాణ్యమైన వస్తువులను ఉత్పత్తి చేయాలి. ఉత్పత్తి కయ్యే ఖర్చు తగ్గించుకోవాలి.

దేశీయ పరిశ్రమలను ప్రోత్సహించాలనే ఆసక్తితో ప్రభుత్వం లోహపరిశ్రమలు యివి వినియోగించుకొనే ముడిలోహముల దిగుమతిపై పన్ను తగ్గించింది. ముడిలోహముల దిగుమతికై ప్రభుత్వం, విదేశాలతో రాయబారములు సాగించుచున్నవి. డాలర్ ప్రాంతమునుండి విరివిగా యిలాంటి లోహముల దిగుమతికి ప్రభుత్వం అనుమతిస్తున్నది.

అన్ని పరిశ్రమలను, ముఖ్యంగా దేశంలో పెరిగి వర్ధిల్లవలసిన పరిశ్రమలను తోడ్పడుటకు ప్రభుత్వం సంసిద్ధంగా ఉన్నది. అయితే యీ పరిశ్రమలు, ప్రభుత్వ విధానానికి అనుగుణంగా వ్యవహరించాలి.

విదేశాలలో ముడిపదార్థముల ధరలు మారిపోవుటవల్ల స్పెక్యులేటివ్ వ్యాపార మనస్తత్వం ప్రబలింది. ఇది చాలా గర్హనీయము. ఈ మనస్తత్వము యికముందు కూడా ఉన్నట్లయితే, పరిశ్రమలకు నష్టం వాటిల్లి తీరుతుంది. కనుక, ఇలాంటి స్పెక్యులేటివ్ వ్యాపారాలను అరికట్టుటకు ప్రభుత్వం తగుచర్య తీసుకోగలదు.

"ప్రతి పరిశ్రమలోనూ అవసరమైన, సాంకేతిక విద్యావేత్తలను ప్రభుత్వం కై సంతతివ్వలో తయారుచేయాలని ఆశిస్తున్నది. ఈ విషయంలో విదేశ సహా

2 పేజీ చూడుడు



# రైళ్ల వేళలు

1949 ఏప్రిల్ 1 వ తేదీ నుండి మదరాసు సెంట్రలు స్టేషనులో అమలులో వున్న రైళ్ల వేళలు:

మద్రాస్ సెంట్రల్

| | రాక | పోక |
|---|---|---|
| కలకత్తా మెయిలు | ఉ 8-5 | సా 6-25 |
| ఢిల్లీ ఎక్స్‌ప్రెస్ | సా 5-5 | ఉ 10 0 |
| విశాఖపట్నం | | |
| ప్యాసింజరు | రా 8-25 | సా 7-35 |
| బుద్ధా ప్యాసింజరు | మ 11-30 | ఉ 8-10 |
| బిట్రగుంట ,, | మ 3-20 | మ 12-40 |
| బొంబాయి మెయిలు | ఉ 5-50 | రా 8-50 |
| ,, ఎక్స్‌ప్రెస్ | సా 7-25 | ఉ 7-10 |
| రాయచూరు | | |
| ప్యాసెంజరు | సా 5-55 | ఉ 8-45 |
| రేణిగుంట ప్యాసింజరు | ఉ 9-48 | సా 5-35 |
| ,, ,, | రా 9-30 | — |
| ఆర్కోణం ,, | సా 6-32 | — |
| బెంగుళూరు మెయిలు | ఉ 6-5 | రా 9-15 |
| ,, ఎక్స్‌ప్రెస్ | మ 3-40 | మ 12-50 |
| బెంగుళూరు ప్యా॥ | రా 8-35 | ఉ 6-40 |
| ,, ,, | ఉ 5-35 | రా 9-20 |
| జాలార్పేట ,, | మ 1-20 | మ 11-03 |
| కొచిన్ ఎక్స్‌ప్రెస్ | ఉ 9-5 | సా 5-51 |
| బెంగుళూరు ,, | ఉ 7-30 | సా 7-15 |
| నీలగిరి ఎక్స్‌ప్రెస్ | ఉ 7-10 | రా 8-00 |











# తూర్పు గంగవరంలో పోలీసు కాల్పులు

## అసెంబ్లీలో మంత్రిగారి సమాధానము

పేమకస్ చెల్లించడానికి జూన్ ఆఖరువరకూ గడువు

చెన్నపట్నం, ఏప్రిల్ 22: శ్రీ బి. అసెంబ్లీలో నేడు పెగుమాళ్ల నాయుడు ప్రశ్నకు జవాబిచ్చుచు సభానాయకుడు శ్రీ గోపాలరెడ్డిగారు నెల్లూరుజిల్లా దర్శి తాలూకా తూర్పు గంగవరం గ్రామంలో పోలీసు కాల్పులు జరిగినవని తెల్పిరి సంఘటనకు సంబంధించిన సమగ్ర నివేదిక ఇంకనూ అందలేదు. కలెక్టరునుండి అందిన టెలిగ్రాము నుబట్టి గ్రామపొలిమేరలో గంటి గంగజాతరకు కూడినజనము ఉద్రిక్తులై సబ్‌మాజస్ట్రేటును సబ్‌ఇన్‌స్పెక్టరు ఆఫ్ పోలీసు బందోబస్తుకువుండిన పోలీసు కానిస్టేబుల్సుపైబడిరి. పాకలకు నిప్పంటించిరి. అందుకలన పోలీసులు కాల్పులుచేయవలసి వచ్చినదని మంత్రిగారు తెలిపిరి.

జనసమూహములోని ఒకడు మరణించెను. ఒకడు గాయపడెను. సబ్‌మేజస్ట్రేటు పోలీసుఉద్యోగులు అయిదుగురు గాయపడిరనికూడ తెలిపిరి.

శ్రీ రాఘవయ్య: సంఘటన జరిగిన ప్రాంతశాసనసభ్యునితో కూడిన నిష్పాక్షిక కమిటీ నియమించి విచారణచేయించెదరా?

మంత్రి: సమగ్రమైన నివేదికఅందిన దరిమిలా తీసుకొనవలసిన చర్యగూర్చి పరిశీలించబడును.

### రేస్‌క్లబ్బు సభ్యులుగా ప్రభుత్వోద్యోగులు

ప్రభుత్వోద్యోగులు రేస్‌క్లబ్బులో కార్యవర్గసభ్యులుగానుండే విషయమై అడిగినప్రశ్నకు సభానాయకుడు బదులు చెప్పుచూ కొందరు ప్రభుత్వోద్యోగులు రేస్‌క్లబ్బు స్టీవర్డులునుండుట వాస్తవమేననియు ఆక్లబ్బుకూడా సోషల్‌క్లబ్బుగా నున్నందున దానియందు ప్రభుత్వోద్యోగులు కార్యనిర్వాహకులుగా నుండుటకు ప్రభుత్వము అనుమతి బడయనక్కరలేదనియు చెప్పిరి. వారాలాపై క్లబ్బుస్టీవర్డులుగా నున్నకారణమున వారలు నిర్వహించవలసిన ప్రభుత్వోద్యోగ విధులకెట్టిభంగము కలుగుటలేదనికూడా మంత్రిగారునుడివిరి.

పోలీసు ఇన్‌స్పెక్టరు జనరలు రేస్‌క్లబ్బు ఉద్యోగిగ ఎన్నుకొనబడుటకు ఓట్లు సంపాదన సందర్భములో పోలీసు అధికారబలమును ఉపయోగించిన విషయము నిజమేనా యని శ్రీ కరంత్‌గారు అడుగగా అట్టి వార్తయేమీ ప్రభుత్వమునకు తెలియదని సమాధాన మీయబడెను.

### విజయవాడలో మశూచికము అణచుటకు చర్యలు

విజయవాడలో 1949 జనవరి 1 నుండి ఫిబ్రవరి 28 వ తేదీవరకు 602 మశూచికం కేసులు సంభవించెననియు, వారిలో 135 మంది చనిపోయినారనియు పట్టణములో జనసమ్మర్దమెక్కువయగుటయు, హైదరాబాదు యింకా యితర ప్రదేశాలనుండి శరణార్థులు రావడము ఈ వ్యాధి ప్రబలముగా వ్యాపించుటకు కారణమయ్యెననియు వ్యాధిని అణచుటకు ఆరోగ్యశాఖ సిబ్బందిని ఎక్కువచేయుట, టీకాలు వేయుట ఆసుపత్రి సౌకర్యములుకల్పించుటమున్నగు చర్యలు తీసుకొనడమైనదనియు, ఆరోగ్యశాఖామంత్రి శ్రీ ఏ. బి. షెట్టిగారు శ్రీ బి. యస్. మూర్తిగారి ప్రశ్నకు బదులుగా చెప్పిరి.

### పేష్‌కష్ చెల్లించుటకు గడువు పొడిగింపు

రెవిన్యూమంత్రి శ్రీ హెచ్. సీతారామరెడ్డిగారు రాజా సర్ ముత్తయ్యచెట్టిగారడిగిన ప్రశ్నకు సమాధానము చెప్పుచు జమీందారులు పేష్‌కష్ చెల్లించుటకు గడువు జూను 30 వ తేదీ రకు ప్రభుత్వము పొడిగించియున్నదని ప్రకటించిరి.

### రాష్ట్రంలో మరణదండన వివరములు

మదరాసు, ఏప్రిల్ 22: శ్రీ నాగప్ప ప్రశ్నకు సమాధానమిచ్చుచు న్యాయమంత్రి శ్రీ కె. మాధవమీనన్ రాజధానిలో 1946 సం॥లో 165 1947 లో 110 1948 లో 77 సరికి మరణశిక్ష విధించబడినవనియు, 1946 లో 65, 1947 లో 30, 1948 లో 24 కేసులలో శిక్ష తగ్గించబడినదనియు, 1948 లో శిక్షించబడిన 6 గురి విన్నపములు పరిశీలించబడు చున్నవని తెలిపిరి.

### న్యాయ కార్యనిర్వాహక శాఖల విభజన

మదరాసు, ఏప్రిల్ 22: శ్రీ పీసం అమీరుద్దీన్ ప్రశ్నకు జవాబు ఇచ్చుచు శ్రీ గోపాలరెడ్డిగారు న్యాయ కార్యనిర్వాహకశాఖల విభజన అమలు గురించి అంతిమనిర్ణయము చేయలేదని తెలిపిరి.

సిబ్బంది తగ్గింపు కమిటీవారు చేసిన సూచనను అమలుజరుపుటకు ఇంత కాలహరణమేల అయినదని ఒక సభ్యుని ప్రశ్నకు పై సమాధానమీయబడినది.

# హిందూ ధర్మాదాయ బిల్లు: సెలెక్టుకమిటీ

## కౌన్సిలులో ప్రతిపాదన

మదరాసు, ఏప్రిల్ 22: మదరాసు కవున్సిల్ నేడు శ్రీ ఆర్. బి. రామకృష్ణ రాజుగారి అధ్యక్షత క్రింద సమావేశమైనప్పుడు సభానాయకులు డాక్టరు శ్రీ రాజన్ కవున్సిల్ రూల్సుక్రింద మదరాసు హిందూ మతధర్మాదాయబిల్లు పరిశీలనకు నియమించబడిన సెలెక్టు కమిటీ దక్షిణాదిన ఎచటనైనా సమావేశమగుటకు అనుమతి కోరుచు ఒక ప్రతిపాదన చేసిరి.

శ్రీ బి. భీమరావుగారు ఒక సవరణ ప్రతిపాదించిరి.

శ్రీ వి. కె. జాన్‌గారు ప్రభుత్వ ప్రతిపాదనను సమర్థించుచుమాట్లాడిరి.

జనాబ్ ఫకీరు సాహెబ్ ప్రభుత్వ ప్రతిపాదనను సమర్థించిరి.

మంత్రి డాక్టరు రాజన్‌గారు మాట్లాడుచు సెలెక్టుకమిటీ చాల పెద్దది. అనేకమందిని సాక్ష్యమునకు పిలిచినది. సాక్ష్యమును సేకరించుటకు అనుకూలమైనచోట సెలెక్టు కమిటీ సమావేశమగుటకు వీలునుకోరుట యే ఈప్రతిపాదనవుద్దేశ్యము అని చెప్పిరి.

శ్రీ భీమరావుగారు సవరణను ఉపసంహరించుకోనందున అధ్యక్షుడు సవరణను ఓటుకు పెట్టి వీగిపోయినట్లు ప్రకటించిరి. తరువాత ప్రభుత్వ తీర్మానము ఓటుకు పెట్టగ అంగీకరించబడినది.

న్యాయమంత్రి శ్రీ కె. మాధవమీనన్ అసెంబ్లీలో అంగీకరించబడిన పాతచట్టములను పునరామోదించు బిల్లును ప్రవేశపెట్టిరి. శ్రీ మాధవమీనన్‌గారు, సెలెక్టు కమిటీ సూచనలను వివరించిరి.

డాక్టర్ వి. కె. జాన్‌గారు మాట్లాడుచు సిటీ అభివృద్ధి చట్టమును, విదాశీ చట్టము గురించి మంత్రిగారు హామీ ఇయవలెనని కోరిరి.

బిల్లు, క్లాజువారి అంగీకరించబడిన తరువాత బిల్లు శాసనముగ అంగీకరించబడినది.

అధ్యక్షులు కౌన్సిలును అనిర్ణీతముగ వాయిదా వేయుచు ఘనత వహించిన గవర్నరు సందేశమును చదివిరి.

## తుంగభద్ర భూములు

తుంగభద్ర ప్రాజక్టుకొరకు ప్రభుత్వం వారు తీసుకుంటున్న భూముల పరిష్కారం త్వరగ జరుగుటకై హాస్పెటకేసులకుమాత్రం లాండు అక్విజను ఆక్టుప్రకారం విచారించుటకు జిల్లామునసబుకి అధికారం యివ్వరాదాయని బి. భీమరావుగారు ప్రశ్నింపగ మదరాసు కౌన్సిలులో మంత్రి సీతారామరెడ్డిగారు ప్రత్యుత్తర మొసంగుచు, దానిగూర్చి అనేక న్యాయచట్ట సంబంధమగు చిక్కులు వున్నవిగావున ప్రభుత్వంవారు ఆలోచించుచున్నారు. వీలయినంత త్వరలో నిర్ణయం గావింతురని చెప్పిరి.

### మునిసిపలు కౌన్సిలరు

విజయనగరం మునిసిపలు కౌన్సిలు సభ్యులు యిద్దరు మూడు నెలలు వరుసగ రానందున సభ్యత్వం పోయినట్లు కమిషనరు రూలు ప్రకారం వారికి నోటీసు పంపలేదనియు, అతడు చట్ట ప్రకారం పనిచేయనందుకు అతనిపై చర్య దీసుకొనుట గూర్చి ప్రభుత్వంవారు ఆలోచిస్తున్నారనియు చలమాజీగారి ప్రశ్నకు బదులుగా కౌన్సిలులో గా॥ చంద్రమౌళిగారు బదులు చెప్పిరి.

## మధ్యతరగతివారికి గృహనిర్మాణ కార్యక్రమం

మదరాసు, ఏప్రిల్ 21, మదరాసు ప్రభుత్వ మద్య నిషేధ మంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు నేటి మధ్యాహ్నం అయనవరములో మూడువేల రూపాయలతో ఎర్నాకులం ఇంజనీరుచే నిర్మించబడుతున్న నమూనా ఇళ్లను చూచిరి. మంత్రిగారితోపాటు మాజీ మంత్రి శ్రీ యస్. గురుపాదముగారు వుండిరి.

పత్రికా విలేఖరులతో మాట్లాడుచు మద్య నిషేధమంత్రి తక్కువజీతములవారికి ఉపయుక్తముగ వుండు గృహనిర్మాణము అత్యావసరమనియు అట్టి గృహములను నిర్మించుట ప్రభుత్వ ఉద్దేశ్యమని చెప్పిరి. ఈ నమూనాలే గాక ఇంకనూ ఒకటి రెండు ప్లానులు వున్నవి. బొంబాయిలోను, ఢిల్లీలోను చవకగ ఇళ్లు కట్టుచున్నట్లు తెలుస్తుంది. వానిని కూడ చూచి అన్ని ప్లానులను పరిశీలించి ఏది చవకగ, ఉపయుక్తముగ వుండునదీ ప్రభుత్వము పరిశీలించును అని చెప్పిరి.

మంత్రిగారు అయినవరంలో నిర్మించబడుచున్న నమూనా ఇల్లుచూచి సంతృప్తిని వెలిబుచ్చిరి.

### అగ్రికల్చరల్ డిపార్టుమెంటు పునర్నిర్మాణము

మదరాసు, ఏప్రిల్ 22: అగ్రికల్చర్ డిపార్టుమెంటును పునర్నిర్మాణము చేయుట ఎనిమిది అగ్రికల్చర్ డిప్యూటీ డైరెక్టరు ఉద్యోగములను రద్దుచేయుట గురించి ప్రభుత్వము పరిశీలించుచున్నట్లు తెలియుచున్నది.

# ఇండియా-పోలెండు వ్యాపార ఒడంబడిక

## ఢిల్లీలో సంతకాలు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 22: ఇండియా పోలెండు దేశాల వ్యాపార ఒడంబడికపై నేడు భారత ప్రభుత్వ వాణిజ్య మంత్రి కార్యాలయంలో సంతకాలు జరిగినవి. వాణిజ్యశాఖ కార్యదర్శి సి. సి. దేశాయిగారు భారత ప్రభుత్వం తరఫున సంతకం చేశారు. భారత ప్రభుత్వం ఇప్పటివరకూ చేసిన వ్యాపార ఒడంబడికలలో ఇది 8 వది. ఒడంబడిక ద్వారా భారతదేశానికి పోలెండునుంచి సిమెంటు, ఉక్కు, యంత్రాల పనిముట్లు, 30 హెచ్పి. సి. మోటార్లు, కేబుల్స్, కంటిఅద్దాలు, ముడి ఫిలిము లభ్యంకాగలవు. భారత దేశం అభ్రకం, లక్క, ప్రత్తి, తేయాకు, జాలు మొదలైనవాటిని ఎగుమతిచేస్తోంది.

# ఆంధ్రరాష్ట్ర రైతాంగ రాజకీయ శిక్షణాలయం

విజయవాడ, ఏప్రిల్ 20: హైదరాబాదు సంస్థానంలోని వరంగల్లు జిల్లా పాలేరుగ్రామంలో మే 1 నుంచి 15వరకు రైతాంగ రాజకీయ శిక్షణాలయం నిర్వహింపబడుతుందనీ, ఎన్. జి. రంగాగారు ప్రారంభోత్సవం జరుపుతారనీ, దీనికి సంబంధించిన వివరాలు కావలసినవారు ఆంధ్రరాష్ట్ర రైతుకాంగ్రెస్ అధ్యక్షుని పేర విజయవాడకుగానీ, డాక్టర్ ఎం. చెన్నారెడ్డిగారికి సుల్తాన్ బజార్ హైదరాబాదుకుగానీ, వ్రాయవచ్చునని రా. రై. కాం. అధ్యక్షుడు గో. వెం. సుబ్బయ్యగారు వ్రాశారు.

## కీ. శే. ఆలూరి మధ్వాచార్యులుగారు

కర్నూలు ఏప్రిల్ 20: స్థానిక ప్రముఖ న్యాయవాదియగు ఆలూరి, మధ్వాచార్లు గారు 75 ఏట స్వగృహమందు క్రిందపడి అకస్మాత్తుగా మరణించినారని తెలుపుటకు విచారించుచున్నాము. వీరి భార్య కాశీయాత్రకువెళ్లి ఇంకనురాలేదు. కుమార్తె, అల్లుడు, తదితరులు నిన్నటి దినం వచ్చిన పిదప దహనము చేయబడెను.

## చిత్తూరు జిల్లా ఆహార సంఘము

తిరుత్తని, ఏప్రిల్ 18: చెన్నరాష్ట్ర ప్రభుత్వము వారి క్రింద సభ్యులతో చిత్తూరు జిల్లా ఆహార సంఘమును నూతనముగా నియమించిరి. అధికార సభ్యులు, జిల్లాకలెక్టరు, జిల్లా సప్లయిఆఫీసరు, జిల్లా వ్యవసాయ శాఖాధికారి, జిల్లా సహకార శాఖ డిప్యూటీ రిజిస్ట్రార్, మదనపల్లి, చిత్తూరు, చంద్రగిరి రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, జిల్లా ఆరోగ్య శాఖాధికారి, జిల్లా పశువైద్య శాఖాధికారి, జిల్లా ఇంజనీరు, జిల్లాకాంగ్రెసు అధ్యక్షులు, జిల్లాలోని రాష్ట్ర శాసన సభ సభ్యులు అయిదుగురు అధికారేతర సభ్యులు, టి. ఎన్. వెంకట సుబ్బారెడ్డి, ఎ. బలరామరెడ్డి, సి. రఘుపతిచెట్టి, మయిపూరి. లక్ష్మన్న, పాత్ర, సింగారయ్య, రావుబహదూరు జి. గురువప్పనాయుడు, శ్రీమతి కట్టమంచి రామస్వామిరెడ్డి, పి. మార్గేశచెట్టి, సి. బాలగంగాధరరెడ్డి, పి. గోపాలరెడ్డి, కె. ఆదికేశవులునాయుడు, డి. ఆర్. కృష్ణన్, వి. వెంకటరెడ్డి, పి. వరదరాజులు రెడ్డిగార్లు— (స్వ. వి.)

## ధవళేశ్వరమువద్ద రవాణా రుసుములు

మదరాసు, ఏప్రిల్ 22: మదరాసు ప్రభుత్వము ధవళేశ్వరము ఆనకట్టమీదుగ మైరుబండ్లు వెళ్లుటకు అనుమతించుచు కొంత రుసుము నిర్ణయించినది.

ధవళేశ్వరమునుండి బొబ్బర్లంక బొబ్బర్లంక నుండి విజ్జేశ్వరం రెండు అంచెలుగ రుసుము విభింపుకు ఎంచబడును. ప్రతి అంచెలో ఒక దఫా ప్రయాణమునకు ఈ క్రింది విధముగ రుసుములు వసూలు చేయబడును. కారు 1॥కి రు 1-0-0 3 టన్నుల బరువుకు మించనిలారి 1॥కి రు 3-0-0 బస్సుకు రు 3-0-0లు.

రాకపోకల సదుపాయముకు, నియమించబడిన సిబ్బంది ఖర్చులకు, రోడ్ మరమ్మతులకు ఈ రుసుముల ఆదాయము వినియోగించబడునని ప్రభుత్వమువారు ప్రకటించుచున్నారు.

### పట్టణములలో నిర్బంధ ప్రాథమిక విద్య

మదరాసు, ఏప్రిల్ 22: పట్టణప్రాంతములలో నిర్బంధ ప్రాథమిక విద్యావిధానమును వెంటనే అమలు బర్చుట గురించి ప్రభుత్వమువారు పరిశీలించుచున్నట్లు తెలియుచున్నది.

పదిసంవత్సరములలో సార్వజనిక నిర్బంధ ప్రాథమిక విద్యావిధానమును ప్రవేశపెట్టుట గురించి కూడ ప్రభుత్వము పరిశీలించుచున్నట్లు తెలుస్తుంది.

# బ్రిటిష్ సింహాసనంతో ఐరిష్ రిపబ్లిక్ సంబంధాలు

బ్రిటిష్ ప్రాజాపత్యమునుండి 1921 వ సంవత్సరములో ఐర్లెండు విముక్తిపొందినది. అయినప్పటికినీ 1936 వ సంవత్సరమువరకు అధినివేశ ప్రతిపత్తిని అనుభవించుచు, బ్రిటిష్ సింహాసనమునకె కట్టుబడి యుండెను. ఆ సంవత్సరము ఐరిష్ ప్రధాని డీవెలరా విదేశ వ్యవహారములను మాత్రం బ్రిటిష్ రాజు పరంగా జరిపించుటకు, దేశ వ్యవహారములలో వారికెట్టి ప్రమేయము లేకుండా ఉండునట్లు ఐరిష్ రాజ్యాంగ శాసనను మార్పిపైచెను. అందువలన ఐర్లెండు నామమాత్రముగనె బ్రిటిష్ కామన్వెల్తునందు ఉంటూవచ్చెను. గతశుక్రవారం ఈమాత్రం సంబంధంకూడా లేకుండా రద్దయిపోయింది. భారత దేశంకూడా బ్రిటనుతో తనకుఉండవలసిన సంబంధాలను నిర్ణయించుకొనవలసి యున్నది. ప్రస్తుతం లండన్‌లో జరుగుతూఉన్న కామన్వెల్తు సమావేశంలో ఈ విషయమే ఎక్కువ ప్రాముఖ్యం వహించేటట్లు కన్పించుచున్నది. ఈసందర్భంలో 1921 నుండి ఇప్పటివరకూ బ్రిటన్-ఐర్లెండు సంబంధాలు ఏవిధంగాఉంటూవచ్చినవో తెలుసుకోవడం అవసరం. ఈవ్యాసం అందుకు కొంతవరకు ఉపయోగపడగలదు.

శతాబ్దాల తరబడిగా బ్రిటిష్ కబంధ బంధమై, విముక్తికోసం ఎన్నో పోరాటాలు, త్యాగాలు చేసి చివరికి విజయం సాధించిన ఐర్లెండు ద్వీపం గత ఆదివారం అర్ధరాత్రివేళ సర్వస్వతంత్ర రిపబ్లిక్‌గా స్వాతంత్ర్యోత్సవం జరుపుకున్నది. కాని ఈ స్వాతంత్ర్యం ఏకాదశి చంద్రునివలె అసంపూర్ణమై, ద్వీపంలోని ఈశాన్యభాగం బ్రిటనుతోనే ఇంకా సమైక్యమై ఉంటుంటంవల్ల ప్రపంచ ప్రజలకు కించిత్ సంతృప్తినే కలిగిస్తున్నది. పైగా, చంద్రునికి కళంకంవలె, డీవలరా పక్షంవారికీ, ప్రధాని కాస్టెల్లో పక్షంవారికీ వచ్చిన అభిప్రాయ భేదాలుకూడా మరికొంత నిరుత్సాహజనకంగా ఉన్నవి. ఏమైనా, సుదీర్ఘ స్వాతంత్ర్యపోరాటం జరిపి ఐర్లెండు తన ఆదర్శంలో కొంతభాగామైనా సాధించగలగడం సంతోషకరం.

1921 లో జరిగిన సంధిద్వారా బ్రిటిష్ కామన్వెల్తులోని స్వపరిపాలనా రాజ్యంగా మారిన ఐర్లెండు ప్రస్తుత స్వతంత్ర రిపబ్లిక్ స్థాయికి వచ్చేలోపున బ్రిటను-ఐర్ సంబంధాలలో అనేక వైషమ్యాలు, చిక్కులు ఎప్పటికప్పుడు పొడచూపుతూనే వున్నవి. ఈసంధిలోని ప్రథమసూత్రం ప్రకారము, బ్రిటిష్ సామ్రాజ్యంలోని ఆస్ట్రేలియా, న్యూజిలెండు, కెనడా, దక్షిణాఫ్రికాల వంటి రాజ్యాంగమును, ప్రతిపత్తినే ఐర్ కూడా పొందినది; బ్రిటిష్ పార్లమెంటుతోను, ప్రభుత్వంతోను గల సంబంధాలలో మాత్రం కెనడాను అనుసరించినది.

కామన్వెల్తులో ఐర్‌కుగల స్థానాన్ని చూస్తే బ్రిటిష్ రాజ్యాంగపద్ధతి ఎంత తేలికగా పరిస్థితుల ననుసరించి మారిపోగలున్నదో స్పష్టమౌతుంది. కామన్వెల్తులోని ఇతర రాజ్యాలన్నీ గత ప్రపంచయుద్ధంలో పాల్గొన్నవి. ఒక్క ఐర్లెండు మాత్రం తుదివరకూ కఠిన తాటస్థ్యమునే అనుసరించింది. ఐర్లెండుయొక్క ప్రత్యేక హోదా కిది నిదర్శనం.

## డీవెలరా పరిపాలన కాలంలో జరిగిన మార్పులు

1921 లో ఐర్లెండులో ప్రభుత్వం చేస్తున్న పార్టీ అధినివేశప్రతిపత్తికి అంగీకరించింది. కాని, డీవలరా పక్షంమాత్రం అల్‌స్టర్ రాష్ట్రంతోసహా ఐర్లెండు యావత్తునూ రిపబ్లిక్ రాజ్యంగా చేయాలని పట్టుబట్టింది. డీవలరాపక్షం 1932 లో అధికారానికి వచ్చింది. క్రమంగా డీవలరా ప్రభుత్వ విధానంలో మార్పులుచేయ సమకట్టాడు. ఐరిష్ శాసన సభ్యులు ఇంగ్లీషు రాజుకు విధేయతా ప్రమాణం చేయ నవసరంలేదని, ప్రివీకౌన్సిలుకు అప్పీళ్లుచేయుటకు వీలులేదని 1933 లో రెండు శాసనములు చేయబడినవి. 1936 లో 8 వ ఎడ్వర్డు సింహాసన పరిత్యాగం చేసినప్పుడు ఐర్లెండులోని గవర్నరు జనరలు పదవి రద్దుచేయబడింది. అప్పటినుంచి ఐరిష్ అంతరంగిక వ్యవహారాలలో బ్రిటిష్‌రాజుకు ఎట్టి అధికారము లేకుండా పోయింది. విదేశవ్యవహారాలలో మాత్రం కొంత అధికారం నిలిచింది.

1937 అంతంలో ఐర్లెండులో నూతన రాజ్యాంగం అమలులోనికివచ్చింది. దీనివలన ఐర్లెండుయొక్క కామన్వెల్తు సభ్యత్వపు హోదాలో ఎట్టిమార్పూ రాదని బ్రిటన్, తదితర అధినివేశాలు గుర్తించినవి.

ఐర్లెండుకూ, మిగతా అధినివేశాలకూ తేడా ఏమిటంటే, కెనడా మొదలైన దేశాలలో బ్రిటిష్‌రాజు నామమాత్ర సర్వాధిపతిగా ఉంటాడు. రాజప్రతినిధి గవర్నరు జనరలుగానూ, బ్రిటిష్ ప్రభుత్వ ప్రతినిధి హైకమిషనర్‌గానూ ఉంటారు. ఐర్లెండులో రాజప్రతినిధిగాని హైకమిషనర్‌గాని ఉండరు. గవర్నరు జనరలుకు బదులు అక్కడ ప్రెసిడెంటు సర్వాధిపతిగాను, హైకమిషనర్‌కు బదులు ఒకప్రతినిధి వ్యవహారిస్తూ ఉంటారు. కాని లండనులో ఐరిష్ హైకమిషనర్ ఉంటాడు.

అయితే విదేశాంగ వ్యవహారాలన్నిటిలోను ఐర్లెండు ఇంగ్లీషు రాజు పేరుతోనే తన అధికారకలాపాలన్నిటినీ నెరపుకుంటుంది.

## మూడు ఒడంబడికలు

1938 లో బ్రిటనుకు ఐర్లెండుకూ మధ్య అతి ప్రధానమైన 3 ఒడంబడికలు జరిగినవి. నౌకాస్థావరములు, వార్షికకప్పము, వ్యాపారము, ఈ మూటికీ క్రమంగా సంబంధించినవి ఈఒడంబడికలు.

## నౌకా స్థావరాలు

ఐరిష్ తీరము, ఐరిష్ సముద్రమూ బ్రిటనుకు కీలకస్థానం దృష్ట్యా చాల ప్రాణప్రదమైనవి. 1921 సంధిమూలంగా ఐర్లెండులో ఆగ్నేయంగా ఉన్న క్వీన్స్‌టౌను, దక్షిణంగా ఉన్న బీర్‌హావెన్, ఉత్తరంగా ఉన్న లాఫ్ స్విల్లీ అనే ప్రధాన రేవుపట్టణాలు మూడింటినీ సంరక్షించేటందుకుగాను బ్రిటన్ తన సేనల నక్కడ ఉంచుటకు అవకాశం కలిగింది. కాని ఈవిధంగా బ్రిటిష్ సేనలు తన గడ్డపై నిలిచిఉండటం తన స్వతంత్ర స్థాయికి భంగమని ఐర్లెండు మాటిమాటికీ అసహనం వెల్లడిస్తూవచ్చింది. తత్ఫలితంగా 1938 లో ఒక ఒడంబడిక జరిగింది. బ్రిటిష్‌వారు ఈ రేవులను, వాటి రక్షణభారమును ఐరిష్‌వారికిచ్చి వేశారు.

## వార్షిక కప్పములు

ఇవి ఉభయదేశాల వివాదాలకు మరొక కారణంగా పరిణమించినవి. ఏడాదికి 3 కోట్ల రూ. దాకా ఇచ్చే ఈ చెల్లింపులు 1921 తరువాత జరిగిన ఒప్పందాలద్వారా లభించే న్యాయప్రకారం ముట్టవలెనని బ్రిటన్ వాదన. 1932 లో డీవలరా ప్రభుత్వం ఈ ఒప్పందాలను బుట్ట దాఖలుచేసి కప్పంకట్టడం ఆపివేసింది. ఈ కప్పం సొమ్ము యొక్క మొత్తాన్ని ఏలాగైనా రాబట్టవలెనని, బ్రిటిష్ ప్రభుత్వం ఐర్లెండునుండి దిగుమతి అయ్యే కొన్ని ముఖ్యవస్తువులపై ప్రత్యేక సుంకములు విధించ మొదలెట్టింది. దీనికి ప్రతీకారంగా ఐరిష్ ప్రభుత్వం 1932 జులైలో కొన్ని బ్రిటిష్ సరకులపై ప్రతిసుంకాలు విధించి, ఎగుమతిదారులకు అనేక సహాయంకూడా చేసింది.

ఈ కఠిన నిబంధనలు 1935 లోను 1936 లోను, తిరిగి 1937 లోను కొద్ది కొద్దిగా సడలింపబడినవి. 1938 ఏప్రిల్ కల్లా పూర్తిగా పరిష్కారమైనవి. 1938 ఒడంబడికలో ఉభయదేశములమధ్య స్నేహ సహకారములు నెలకొల్ప వాంఛించుచున్నామనీ, పరస్పరం చెల్లించుకోవలసి ఉన్న బకాయిలు పరిష్కారం చేయబడగలవని, ఉభయదేశాలమధ్య వ్యాపారం అభివృద్ధిగావింపబడుననీ, ప్రమాణాలు జరిగినవి.

ఈ ఒప్పందం ప్రకారము తాను బకాయిపడిన 16 కోట్ల 60 లక్షల రూ. మొత్తమును చెల్లించుటకు ఐర్లెండు అంగీకరించింది. ప్రతీకారంగా విధించబడిన ప్రత్యేకసుంకాలన్నీ రద్దయినవి.

ఇదిగాక, 1925 ఒప్పందప్రకారం 1987 వరకూ ఐర్లెండు ఏటా చెల్లించుటకొప్పుకొన్న 4 కోట్ల 10 లక్షల రూ.లను చెల్లించుటకుకూడా ఐర్లెండు అంగీకరించింది. ఇది ఇప్పటివరకూ అలాగే చెల్లింపబడుతున్నది.

## వ్యాపారం

1938 ఒక వర్తక ఒడంబడిక కూడా జరిగింది. ఇది 3 సంవత్సరాలపాటు అమలులో ఉండవలెనని, ఆ తరువాత, 6 నెలల నోటీసులో ముగియవలెనని నిర్ణయింపబడింది. ఈ ఒడంబడిక ప్రకారం ఐరిష్ సరకులు రివిన్యూ పన్నులు మరి ఏ సుంకములు లేకుండా బ్రిటనుకు ఎగుమతి చేయబడుటకు, అలాగే కొన్ని బ్రిటిష్ సరకులు సుంకరహితంగా ఐర్‌కు ఎగుమతి యగుటకు నిర్ణయం జరిగింది. బ్రిటన్ నుండి దిగుమతి అయ్యే బొగ్గుపై ఎట్టి లైసెన్సు నిబంధనలు విధింపకుండుటకు, ఇతరదేశాల బొగ్గుపై పన్నులు వేయుటకు కూడా ఐర్ అంగీకరించింది.

ఈ ఒప్పందముల వలన ఐరిష్ ప్రజలకు ముఖ్యంగా కర్షకులకు చాల ప్రయోజనములు కలిగినవి. యుద్ధకాలంలో ఐరిష్ ఎగుమతులలో నూటికి తొంభైవంతులు బ్రిటనుకే వెళ్లినవి. బ్రిటనుకు మరెక్కడా ఆహారధాన్యం దొరక్కపోవటం మూలాన, ఐర్లెండునుంచే విరివిగా దిగుమతి చేసుకున్నది.

యుద్ధ సమయంలో ఉభయ ప్రభుత్వాలూ, ధరలవిషయమై అనేకమగు ఒప్పందాలు చేసుకున్నారు. ఎందుకంటే అనేక విషయాలలో ఈ రెండు దేశాలు పరస్పరాశ్రితములు.

యుద్ధ దుష్ఫలితముల వలన 1947 లో మరికొన్ని ఒడంబడికలు జరిగినవి. వీటి మూలంగా బ్రిటన్ బొగ్గు, వ్యవసాయ యంత్రాలు, ఉక్కు, ముడిప్రత్తి, సరకులు, ఎరువులు, గోధుమవిత్తనాలు ఐర్లెండుకు విరివిగా ఎగుమతి చేయుటకు, ఐరిష్ ఆహారధాన్యాల దిగుమతికి ఎక్కువ ధరలిచ్చుటకు ఒప్పుకొన్నది. దీనికిబదులు సహాయంగా, పశువులు, మాంసము, ఊరవేసినమాంసము, గ్రుడ్లు, పక్షిమాంసము అధికంగా బ్రిటన్ కనుమతి చేయుటకు ఐర్ అంగీకరించింది.

# గత మూడు దశాబ్దాల చరిత్ర సమీక్ష

## ఐర్ విభజన సమస్య

1920 నాటి ఐర్లెండు ప్రభుత్వశాసనం ద్వారా ఉత్తర ఐర్లెండులోని 6 కౌంటీలకు వేరే ప్రభుత్వం ఏర్పడింది. దీని మూలంగా వేరే ప్రభుత్వమే కాక వేరే పార్లమెంటుకూడా ఏర్పడింది. ఈ రెండు భాగాలూ ఎప్పుడు తమ ఉభయులకూ అంగీకారమైతే అప్పుడే ఐక్యంకావచ్చునని, ఒకేప్రభుత్వం, పార్లమెంటు ఏర్పరచుకోవచ్చుననికూడా ఈ శాసనంలో షరతు చేర్చబడింది. కాని ఈశాసనానికి దక్షిణ ఐర్లెండు ఇష్టపడకపోవటంచేత 1922 లో చేయబడిన మరొక శాసనంద్వారా, యావత్ ఐర్లెండుకూ అధినివేశప్రతిపత్తిని బ్రిటిష్ ప్రభుత్వం ఇచ్చింది. కాని ఉత్తర ఐర్లెండు దక్షిణ ఐర్లెండుతో కలిసి ఉండటానికి ఇష్టపడకపోవటంచేత విడిపోయి బ్రిటనతో చేరింది. ఇప్పటికీ దానికి ప్రత్యేకప్రభుత్వం ఉంటూనే వున్నది.

## ఉత్తర ఐర్లెండు

బ్రిటన్‌లో ఒక అంతర్భాగంగానే ఉంటున్నా కొన్ని అంతరంగిక వ్యవహారాలను బెల్‌ఫాస్టులోని తన ప్రభుత్వంద్వారా, తన పార్లమెంటుద్వారా జరుపుకుంటున్నది.

ఉత్తర దక్షిణ ఐర్లెండులను సమైక్యం చేయవలెనని డబ్లినులోని ఐర్ ప్రభుత్వం అనేక సంవత్సరాలనుండీ పట్టువహించి ఆందోళన జరుపుతున్నది. కాని అల్‌స్టర్ రాష్ట్రం మాత్రం తాము బ్రిటనుతోనే కలిసిఉంటామని ఎప్పటికప్పుడు వ్యక్తపరుస్తున్నది. బ్రిటనుతోనే కలిసిఉంటామనే పార్టీవారు మూడింట రెండువంతుల మెజారిటీ సీట్లతో ఎన్నికలలో నెగ్గుతూ అప్రతిహతంగా ఇంతవరకూ ప్రభుత్వం చెలాయిస్తున్నారు.

ఐర్లెండు యావత్తూ ఏక ఖండంగా ఉండాలనే వారికి అల్‌స్టర్ రాష్ట్రంలో మూడింట ఒకవంతు మాత్రమే సంఖ్యాబలమున్నది. వీరు రోమన్ కాథలిక్కులు. బ్రిటనుతో కలిసిఉండాలనే వారు ప్రొటెస్టెంటులు.

1946 మార్చిలో డీవలరా ఇట్లా ప్రకటించాడు.

"25 ఏండ్ల క్రిందట ఈమా ప్రాచీన దేశం రెండుగా నరుకబడింది. దీనికి అప్పుడు మేము ప్రతిఘటించాము. ఇప్పుడు కూడా ప్రతిఘటిస్తున్నాము. మాదేశాన్ని చీల్చటానికి బ్రిటిష్ పార్లమెంటుకేమీ హక్కులేదు. ఈ విభజన మాదేశానికి వినాశకరంగా పరిణమిస్తున్నది. దీనిని ఐరిష్‌ప్రజ ఎన్నటికీ మరిచిపోలేరు; క్షమించలేరు. అది ఉన్నంతకాలం బ్రిటన్, ఐర్లెండులమధ్య సుహృద్భావం ఏర్పడబోదు."

కాని ఐర్లెండు ఐక్యత అనేది ఉభయభాగాల ఇష్టంమీదనే జరగాలికాని బలవంతంగా ఐక్యపరచడం తమ కిష్టంలేదని బ్రిటిష్‌ప్రభుత్వపు వాదన.

ఉత్తర ఐర్లండు బ్రిటిష్ పార్లమెంటుకు 13 గురు సభ్యుల నెన్నుకుంటుంది. వీరిలో అత్యధికసంఖ్యాకులెప్పుడూ బ్రిటనతో కలిసివుండాలనే వారే. సమైక్యతను కోరేవారెప్పుడూ ఇద్దరిని మించి ఉండటం లేదు.

ఉభయభాగాలను ఐక్యపరచాలని ఐర్లండులో తీవ్రవిప్లవవాదులు కొందరు బయలుదేరారు. వీరు సాగించే దౌర్జన్య పద్ధతులు బ్రిటన్ ఐర్లండుల స్నేహమునకే భంగకరంగా పరిణమించటంవల్ల డీవలరా ప్రభుత్వంవారిని కఠినంగా అణచివేసింది.

## ఐర్లెండు తాటస్థ్యం

1939 లో బ్రిటను జర్మనిపై యుద్ధం ప్రకటించినప్పుడు ఐర్లెండు తటస్థంగా ఉన్నది. తన తాటస్థ్యాన్ని రక్షించుకోవడంకోసం ఒక నౌకాబలాన్ని, సాయుధసేనల్ని తయారు చేసుకొన్నది. తన నౌకాస్థావరాలను వేటినీ మిత్రరాజ్యాల నుపయోగించుకోనివ్వలేదు. ఉత్తర ఐర్లెండులోని నౌకాశ్రయములు మాత్రం మిత్రరాజ్యాలకు లభించాయి. అవి కూడా లభించకపోతే ఇంగ్లండుకే ప్రమాదం వాటిల్లేదని విన్‌స్టన్ చర్చిల్ ఒకసారి అన్నాడు.

ఐర్లెండులో ఉన్న అక్షరాజ్యప్రతినిధుల నందర్ని వెళ్ళగొట్టవలసినదనీ, లేకపోతే మిత్రరాజ్య సమాచారాలు వారిద్వారా జర్మనీకి తెలియవచ్చునని 1944 ఫిబ్రవరిలో అమెరికన్ ప్రభుత్వం "ఐర్" ప్రభుత్వాన్ని కోరింది. ఈ కోరికను ఐర్ తిరస్కరించింది.

ఈవిధంగా ఐర్ ప్రభుత్వం తన తాటస్థ్యం కోసం ఎంత తంటాలుపడుతున్నా ఐరిష్ ప్రజ లనేకంగా గతయుద్ధంలో పాల్గొన్నారు. బ్రిటిష్ సేనలలోను, కర్మాగారాల్లోను యుద్ధ విజయంకోసం పాటుపడ్డారు.

ఐర్ ప్రభుత్వపు తాటస్థ్యానికి ఆగ్రహించి 1944 మార్చిలో బ్రిటన్ తనకూ ఐర్‌కూ గల రాకపోకలనూ, ఆఖరికి టెలిఫోన్ సంబంధాలను కూడా రద్దు చేసివేసింది.

## ప్రస్తుత సంబంధాలు

విభజనసమస్య ఒక పెద్ద ప్రతిబంధకంగా ఉన్నప్పటికీ ఆర్థికంగానే కాక, రాజకీయంగా సాంస్కృతికంగా ఉభయ దేశాలు పరస్పరసమాశ్రితములన్న సంగతిని ఇరువురూ గ్రహించారు. బ్రిటిష్ చట్టరీత్యా ఐరిష్ ప్రజలుకూడా బ్రిటిష్‌వారుగనే పరిగణింప బడుతున్నారు. అలాగే ఐర్‌లోని బ్రిటిష్‌వారు, ఇతర కామన్వెల్తు ప్రజలు ఐరిష్ వారిగానే పరిగణింప బడుతున్నారు.

యుద్ధసమయంలో విధించబడిన రాకపోకల నిబంధనలిప్పుడంతర్హితమైనవి. బ్రిటన్, ఐరిష్ వ్యవసాయ ఉత్పత్తులపైనే ఎక్కువగా ఆధారపడినట్లు, ఐర్లెండు కూడా కొన్ని బ్రిటిష్ ముడివస్తువులను, పారిశ్రామిక వస్తువులను, యంత్రాలను అధికంగా కోరుతున్నది. ఇవన్నీ చూస్తే ఉభయ దేశాల భవిష్యత్సంబంధాలు చాలా ఆశావహంగానే ఉన్నవి.

ఐక్యరాజ్యసమితి సభ్యత్వానికిమాత్రం రష్యన్ వీటో ప్రయోగం ఐర్లెండుకు అడ్డం వస్తున్నది. కాని ఈ సభ్యత్వంకూడా సాధింపబడితే, ఐర్లెండు బ్రిటన్‌లు విదేశాంగ వ్యవహారాలలో ఒకత్రాటిపై, ఒకే మాటపై నిలబడి ప్రవర్తింపగలవని మన మూహింపవచ్చును.

## 'బ్రెస్టుకాన్సర్' చికిత్స

పన్నెండు సంవత్సరాలపరిశోధన అనంతరం ఎలుకలలో 'బ్రెస్టుకాన్సర్' ను కలిగించే క్రిమిని కొలంబియా విశ్వవిద్యాలయంలోని శాస్త్రజ్ఞులు తెలుసుకున్నారు. డెట్రాయిట్‌లో సోమవారంనాడు జరిగే అమెరికన్ కాన్సర్ పరిశోధన సంఘ నలభయ్యవ వార్షికసమావేశంలో ఈవిషయం ప్రకటించబడుతుంది.

ఈక్రిమి ఒకరకమైన రసి అని తెలుస్తున్నది. ఎలక్ట్రానిక్ మైక్రోస్కోపు బలమైన కిరణాలసహాయంతో దీని చిత్రం తీయబడింది. నోబెల్ బహుమతిపొందిన డాక్టర్ శామ్యూల్ గ్రాఫ్ గారి నాయకత్వంలో ఈ జట్టు పరిశోధనచేసారు. ప్రతి 25 గురు అమెరికన్ యువతులలో ఒకరికివచ్చే ఈవ్యాధిని గురించిన పరిశోధనలో ఎలుకలకు వచ్చే 'బ్రెస్టు కాన్సర్' కారణాన్ని తెలుసుకొనడం చాలా గొప్ప విషయమని వీరు చెబుతున్నారు.

ఈరసితల్లి ఎలుకపిల్లకిచ్చే పాలద్వారా పిల్లలకు సంక్రమిస్తుందని కొలంబియా శాస్త్రజ్ఞులు చెబుతున్నారు.

దీనికి చికిత్సను కనిపెట్టే కృషి జరుగుతున్నది. తమ దీక్ష పరిశోధనకై కొలంబియా శాస్త్రజ్ఞులు న్యూయార్కులోని ప్రెస్బిటీరియన్ మెడికల్ కేంద్రభవనంలో ఎత్తైన ఒక అంతస్థులో 'ఎలుకల వసతి' నిస్థాపించారు. —గ్లోబ్:

వాల్తేరు, ఏప్రిల్ 20: రిజిస్టర్డు గ్రాడ్యుయేట్ల నియోజక స్థానము నుండి సెనేటుకు జరుగవలసిన ఎన్నిక సందర్భంలో కొట్టి ముక్కల జగన్నాథరాజుగారి నామినేషను ఒక్కటే వచ్చినందున, వారు ఎన్నిక అయినట్లు ప్రకటింపబడెను.

## స్వాతంత్ర్య ప్రతిపత్తి కోసం బ్రిటన్‌తో

# ఐర్లెండు సాగించిన సహాయ నిరాకరణోద్యమం

ఐరిష్ స్వాతంత్ర్యసమరచరిత్రలో ప్రధాన భూమికనువహించి, ఉజ్వలపాత్రను నిర్వహించినది, షిన్‌ఫీన్ రాజకీయపక్షం. ఈ ఉద్యమం, 1904 లో ప్రారంభమై, దిన దినాభివృద్ధిగాంచుతూ, ప్రజావిశ్వాసానికి పాత్రమై, సహాయనిరాకరణోద్యమం ద్వారా, ప్రభుత్వానికి కారాన్ని నైరసం చేసుకున్నారు.

బ్రిటిష్‌ప్రభుత్వం, ఐరిష్‌ప్రజలపట్ల ప్రవర్తించిన దమననీతిని, యీ పక్షం ధైర్యంతో ఎదుర్కొని, బ్రిటిష్‌దాస్య శృంఖలాలకు బద్ధులైన ఐరిష్‌ప్రజలకు, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను లభింపచేసింది. ఈపార్టీప్రముఖనాయకులలో డీవలరా ఒకరు. అధికారం తమకైవశంకాగానే డీవలరాను రిపబ్లిక్ అధ్యక్షునుగా ఏకగ్రీవంగా, ఎన్నుకొన్నారు.

ఐర్లెండులో, 1904 సంవత్సరంలో, షిన్‌ఫీన్ పక్షం స్వాతంత్ర్య పోరాటాన్ని ప్రారంభించింది. ఐరిష్ ప్రజానీకంలో, జాతీయ సమైక్యతను సమకూర్చి, సంపూర్ణ ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్యాన్ని సముపార్జించడమే యీ రాజకీయసంస్థ ఏకైక లక్ష్యం. సహాయ నిరాకరణోద్యమం ద్వారా, హంగేరియన్ ప్రజలు స్వాతంత్ర్యాన్ని పొందినవైనాన్ని వివరిస్తూ, అట్టి పద్ధతులలోనే ఐరిష్ ప్రజాపోరాటం సాగాలని ఉద్బోధిస్తూ, 1904 లో ఆర్థర్ గ్రిఫిత్ ప్రకటించిన "హంగరీ పునరుద్భవం" అనే గ్రంథం యీ సంస్థ నిర్మాణానికి పునాది వేసింది.

"షిన్‌ఫీన్" రాజకీయపక్షం ఏర్పడేనాటికి, ఐర్లెండులో, జాతీయపక్షం (నేషనలిస్టు పార్టీ) రాజకీయ రంగంలో చురుకుగా పనిచేస్తోంది. బ్రిటిష్ పార్లమెంటులో, జాతీయపక్షానికి చెందినవారు, 80 మంది సభ్యులుగా వున్నారు. ఐరిష్ ప్రజలలో అధిక సంఖ్యాకులు, యీ పక్షాన్నే బలపరుస్తూ వచ్చారు. ఐర్లెండు, బ్రిటిష్ సామ్రాజ్యంలోనేవుండి చట్టసమ్మతమైన విధానాలద్వారా స్వయంపరిపాలనాధికారాన్ని సంపాదించుకోవాలన్నది 'నేషనలిస్టుపార్టీ' దృక్పథం.

షిన్‌ఫీన్ ఉద్యమం, ప్రారంభంలో అంతప్రాముఖ్యాన్ని పొందకపోయినప్పటికీ, కార్యక్రమాన్ని నిర్దిష్టంగా సాగిస్తూ, క్రమేణ అభివృద్ధి పొందసాగింది. ఐర్లెండుకు స్వయంపరిపాలనాధికారాన్ని బ్రిటిష లిబరల్‌ప్రభుత్వం, వాగ్దానంచేసినదగ్గరి, 1914 సంవత్సరందాకా, ఆ వాగ్దానం కార్యరూపం పొందనికారణంగా, ఐరిష్ ప్రజానీకంలో, తీవ్రఅసంతృప్తి ప్రబలి, యింతవరకూ నేషనలిస్టుపార్టీని బలపరుస్తూ వచ్చినప్రజలు, నిరాశచెందినారు. 1914 సంవత్సరంలో, బ్రిటిష్‌ప్రభుత్వం ఐర్లెండుకు స్వయంపరిపాలనాధికారం యిచ్చివుంటే, ప్రజలు దానితోనే సంతృప్తిపడి వుండేవారు.

### ప్రథమప్రపంచసంగ్రామం

1914లో, ప్రథమప్రపంచసంగ్రామం రావడం, ఐరిష్ ప్రజానీకానికి బ్రిటిష్ ప్రభుత్వం యిచ్చిన వాగ్దానం ముద్దదాపులు కావడం జరిగాయి. యుద్ధంలో, బ్రిటిష్ ప్రభుత్వానికి, ఐరిష్ ప్రజలు పూర్తిగా తోడ్పడాలని, విశేషంగా బ్రిటన్‌కు సహాయపడాలనీ, నేషనలిస్టుపార్టీ నాయకులు ఆశించారు. ఈ నిర్ణయం, ప్రజలకు నేషనలిస్టుపార్టీ పట్ల తీవ్రవైముఖ్యాన్ని కలిగించింది. అంతేగాక, ఆ పార్టీని బహిష్కరించారు, నేషనలిస్టు పార్టీని విసర్జించుకున్నారు. రాజకీయరంగంలో, కలిగిన యీ మార్పుల ఫలితంగా, నేషనలిస్టుపార్టీ ప్రాబల్యం క్షీణించడం, షిన్‌ఫీన్ ఉద్యమం బలపడటం జరిగాయి.

ఇంతలో, 1916 సంవత్సరంలో ప్రసిద్ధమైన తిరుగుబాటు జరిగింది. షిన్‌ఫీన్ ఉద్యమనిర్మాతలు, అతివాద పక్షానికి చెందిన కార్మిక నాయకులు, యీ తిరుగుబాటుకు నాయకత్వం వహించారు. ఈ తిరుగుబాటు జయప్రదం కాకపోయినప్పటికీ, బ్రిటిష్‌వారి తప్పటడుగుల ఫలితంగా షిన్‌ఫీన్ ఉద్యమం పునరాగమించడానికి సాధనమైంది. తిరుగుబాటుదారుల నాయకులలో 12 మందిని కాల్చి చంపాలని బ్రిటిష్‌ప్రభుత్వం పట్టు పట్టింది. వారిలో ప్రఖ్యాత కార్మికనాయకుడు జిమ్ కానలీ ఒకరు. దీనికితోడు, ఎట్టి నేరారోపణ చేయకుండా, విచారణలేకుండా, మరొక నాయకుని ప్రభుత్వం ఉరితీసింది. ప్రజానాయకులను యీ విధంగా బ్రిటిష్ ప్రభుత్వం దయాదాక్షిణ్యాలు లేకుండా నాశనం చేయటం, యీ సమయంలో కూడా నేషనలిస్టు పక్షంవారు, బ్రిటిష్ ప్రభుత్వాన్ని బలపర్చమని హితబోధ చెయ్యటం, ప్రజల హృదయాలను కంపింపచేశాయి. అనేక వేలమంది ప్రజలు, నేషనలిస్టు పార్టీతో సంబంధాలు తెగతెంపులు చేసుకున్నారు.

దీనికితోడు, ఐర్లెండంతా, నిర్బంధ సైనికశిక్షణ (Cons cription) అమలుపర్చడానికి ప్రయత్నించారు. అల్స్టర్‌లోని 'లాయలిస్టులు' మినహాగా, యావత్తు ఐరిష్ ప్రజానీకం, నిర్బంధ సైనికశిక్షణకు అభ్యంతరం చెప్పారు. రోమన్ కాథలిక్ లు కూడ, ప్రభుత్వ చర్యను నిరసించారు. నిర్బంధసైనిక శిక్షణ అమలుజరిపే పక్షంలో, ఎదిరించడానికి ప్రజలందరూ కృతనిశ్చయులై ఉన్నారని, బ్రిటిష్ వారు గ్రహించి, ఆప్రయత్నాన్ని విరమించుకున్నారు.

### షిన్‌ఫీన్ ఎన్నికల ప్రణాళిక

ప్రథమ ప్రపంచ సంగ్రామం ముగిసేనాటికి, ఐరిష్ ప్రజలందరూ, ఒక్కుమ్మడిగా, నేషనలిస్టు పక్షాన్ని త్యజించి, షిన్‌ఫీన్ పక్షంలో చేరిపోయారు.

1918 లో ఐర్లెండులో జరిగిన ఎన్నికల్లో, నేషనలిస్టుపక్షానికి శృంగభంగమైంది. ఇదివరకు 80 స్థానాలు గెల్చుకున్న నేషనలిస్టులకు యిప్పుడు 6 స్థానాలు మాత్రం వచ్చాయి. షిన్‌ఫీన్ పక్షానికి 73 స్థానాలు లభ్యమైనాయి. ఐరిష్ ప్రజానీకంలో షిన్‌ఫీన్ పక్షానికి వున్న బలం యీ ఎన్నికలు బుజువుచేశాయి.

ఈ ఎన్నికల్లో పాల్గొనే ముందు, షిన్‌ఫీన్ పక్షం, ప్రకటించిన ఎన్నికల ప్రణాళికలోని ముఖ్యాంశాలు:

1. బ్రిటిష్ పార్లమెంటులోని ఐరిష్ ప్రతినిధులను ఉపసంహరించుకోవడం; ఐర్లెండుకు సంబంధించినశాసనాలు, చేయడానికి బ్రిటిష్ ప్రభుత్వానికిగాని మరొక విదేశీ ప్రభుత్వానికిగాని అధికారంలేదని స్పష్టీకరించడం;
2. సైనికచర్యల ద్వారాగాని, ఇతర చర్యలద్వారాగాని, ఐర్లెండును, దాస్యంలోవుంచడానికి బ్రిటన్‌చేసే ప్రయత్నాలను, అరికట్టడానికి ఐరిష్ ప్రజలు తమ సర్వశక్తులూ వినియోగపర్చాలి.
3. ఐర్లెండులోని, వివిధ నియోజకవర్గములనుండి ప్రతినిధులను ఎన్నుకుని, వారితో ఒకరాజ్యాంగ పరిషత్తును ఏర్పర్చి, ఐర్లెండుకు సంబంధించిన వ్యవహారాల్లో వారికి సర్వాధికారాలుయిస్తూ, ఐర్లెండును సాంఘిక, రాజకీయ, పారిశ్రామికరంగాలలో అభివృద్ధిపరచడం.
4. ఐర్లెండును స్వతంత్రదేశంగా ఏర్పర్చమని, శాంతిసమావేశం వారినికోరడం.

### రిపబ్లికన్ పార్లమెంటు అవతరణ

ఎన్నికల్లో విజయంపొందిన షిన్‌ఫీన్ పక్ష అభ్యర్థులు చాలమంది ఎన్నికలనాటికి జైళ్లలో వున్నారు. వారిలో, షిన్‌ఫీన్‌పక్ష నాయకుడు డీవలరా కూడ జైలులో వున్నాడు. షిన్‌ఫీన్ పక్ష కార్యవర్గం, బయటవున్న అభ్యర్థులను, డబ్లిన్‌లో సమావేశపర్చి, వారితో ఐరిష్ రిపబ్లికన్ పార్లమెంటును స్థాపించినది. ఈ సమావేశానికి, నేషనలిస్టుపక్ష అభ్యర్థులు, 'లాయలిస్టు' పక్ష అభ్యర్థులు రాలేదు. ఈ సమయంలోనే, డీవలరా జైలునుండి తప్పించుకు వచ్చాడు. అంతకుముందే డీవలరాను ఐరిష్ రిపబ్లిక్కుకు, అధ్యక్షునిగా ఎన్నుకోవడం జరిగింది. డీవలరా జైలునుంచి రావడంతోటే, ఆయన అధ్యక్షపదవిని ఏకగ్రీవంగా ఆమోదించారు.

రిపబ్లికన్ పార్లమెంటు, ప్రభుత్వ కార్యకలాపాలను నిర్విఘ్నంగా సాగించడం ప్రారంభించింది. ఆర్థర్ గ్రిఫిత్ విధానాలను అతి సాహసంతో అమలుపర్చింది. ఆయన్ను రిపబ్లికన్ ఉపాధ్యక్షుడుగా ఎన్నుకున్నారు.

### భూమి సంస్కరణ విధానం

ఐర్లెండులో భూమిసాగు పద్ధతి అప్పటికి చాల అధ్వాన్నంగావుంది. బ్రిటిషువారు అనేకమంది రైతులను భూములనుండి తరిమివేశారు. ఆ కారణంచేత, అనేకమంది రైతులు అమెరికాకు, ఇతర దేశాలకు వలసవెళ్లిపోయారు. 1846 సంవత్సరానికి, ప్రతి ఏడా జనాభా తగ్గుతూవచ్చింది. రైతులకు సహాయం చేయడం విషయంలో—బ్రిటిష్ ప్రాబల్యం ఇంకా తగ్గనందున-షిన్‌ఫీన్‌పక్షంవారు, ఎక్కువ సహాయపడలేకపోయారు. కొని రైతుల సహాయార్థం, ఒక ద్రవ్యనిధిని ఏర్పాటుచేసి, అధికారం పూర్తిగా హస్తగతమైతే, ప్రజలకు తాము ఎంతగా సహాయపడటానికి వీలుంటుందో నిరూపించారు.

విదేశాలతో వాణిజ్య, వ్యాపార సంబంధాలు, తాము స్వయంగా ఏర్పర్చుకోడానికి, విదేశాలకు తమ ప్రతినిధులను, రిపబ్లికన్ ప్రభుత్వం పంపించింది.

### పరిశ్రమల పునర్నిర్మాణం

ఐర్లెండులో, పరిశ్రమల పునర్నిర్మాణానికి ఎంతవరకు వీలున్నదో సాకల్యంగా పరిశీలించి, సలహా యివ్వడానికి, ప్రవీణులతో కూడిన ఒక కమిషన్‌ను, ఐరిష్ పార్లమెంటు నియమించింది. ఈకమీషన్ అత్యంతుప యోగకరమైన ఒక నివేదికను తయారు చేసింది. కాని బ్రిటిష్ ప్రభుత్వం తన యావచ్ఛక్తినీ వినియోగించి, యీ కమీషన్ కార్యకలాపాలకు అంతరాయం కలిగించింది. ప్రజాసంఘాలు దీన్ని బహిష్కరించాలని, బ్రిటిష్ ప్రభుత్వం ఆజ్ఞాపించింది.

ఐరిష్ పార్లమెంటుచే నియమితులైన ఉద్యోగులలోను షిన్‌ఫీన్ పక్షానికిఅధిక ప్రాతినిధ్యంకల యితర ప్రజా సంస్థలలోని ఉద్యోగులను నేషనల్ సివిల్ సర్వీసును స్థాపించారు.

రిపబ్లికన్ పార్లమెంటును, అక్రమసంస్థయని బ్రిటిష్ ప్రభుత్వంప్రకటించింది. కాని, షిన్‌ఫీన్ కార్యవర్గం రహస్యముగా సమావేశమై, సమాలోచనలు జరుపుతూ వుండేది.

డీవలరా, ప్రజాసేవ చేయటంకోసం తప్పించుకునన్నట్లు అమెరికాకు ప్రయాణంకట్టాడు. షిన్‌ఫీన్ పక్షంపట్ల,

> భారతదేశం స్వాతంత్ర్యాన్ని ఏ విధంగా పొందిందో, ఐర్లెండ్ కూడా అవిధంగా స్వాతంత్ర్యాన్ని పొందింది. భారతదేశం మాదిరే ఐర్లెండ్ కూడా రెండు ముక్కలైనది. నేను కామన్వెల్తు మంత్రివర్గం బ్రిటిష్ సింహాసనంతో ఎలాంటి సంబంధం ఉండకూడదని తీర్మానం చేసి ఆ తీర్మానాన్ని అమలు జరపడానికి ఈస్వాతంత్ర్య సంపాదనా విధానమె చాలావరకు కారణం అని చెప్పవచ్చును. ఈ సమయంలో ఐర్లెండ్ స్వాతంత్ర్య పోరాటానికి సంబంధించిన ఈ వివరాలు గుర్తుకు తెచ్చుకోవడం సమంజసం. ప్రసిద్ధ ఆంగ్ల రచయిత ఫెన్నర్ బ్రాక్వే వ్రాసిన "నాన్ కో-ఆపరేషన్ ఇన్ అదర్ లాండ్స్" అనే గ్రంథం నుంచి ఈ వ్యాస భాగం ఉల్లేఖించబడినది.



డీ వెలరా

## సీన్‌ఫీన్ పక్ష కార్యక్రమం: 1904 నుండి 1921 వరకు జరిగిన సంఘటనల వివరం

అమెరికన్ ప్రజల ఆదరాభిమానాలు సంపాదించడమే కాక, తమపార్టీ కార్యకలాపాలకు, పెద్దమొత్తాన్ని అప్పుగా సేకరించాడు. ఐరిష్ పార్లమెంటు ద్రవ్య సేకరణకు, బ్రిటిష్‌ప్రభుత్వం యెన్నో అంతరాయాలు కలిగించింది. ఈ నిధికి విరాళాలిచ్చినవారిని జైళ్ళలో పెట్టారు.

### రిపబ్లికన్ న్యాయస్థానాలు

రిపబ్లికన్ పార్లమెంటు, న్యాయస్థానాలను, భూమికి సంబంధించిన తగాదాను పరిష్కారం చేయడానికి పంచాయితీ కోర్టులను స్థాపించింది. వలంటీరు పోలీసుదళాన్ని నిర్మించింది. రిపబ్లికన్ పోలీసుదళాన్ని స్థాపించి, దేశంలో శాంతి, రక్షణలు కాపాడారు. నేరస్థులను రిపబ్లికన్‌కోర్టులు విచారణజరిపి, శిక్షలు విధించేవి.

రిపబ్లికన్ పార్లమెంటును స్థాపించడంతోనేగాక, అడ్మినిస్ట్రేటివ్ సర్వీసులన్నిటినీ కైవశం చేసుకోవాలని ఆర్థర్‌గ్రిఫిత్ ప్రధానాశయం.

1920 లో, స్థానికసంస్థల ఎన్నికలు జరిగాయి. లోగడ జరిగినపార్లమెంటరీ ఎన్నికలలోకంటే, షిన్‌ఫీన్ పక్షానికి అత్యధిక మెజారిటీవచ్చింది. నూటికి 75 వంతులు స్థానాలు వీరికే లభించాయి. కౌంటీకౌన్సిళ్ళలోను, జిల్లా కౌన్సిళ్ళలోను, ఇతరస్థానిక సంస్థలన్నిటిలోను, యీపక్షానికి అధికతర ప్రాతినిధ్యం లభించింది.

షిన్‌ఫీన్‌పక్షం మెజారిటీగాగల స్థానికసంస్థలన్నీ, బ్రిటిష్ ప్రభుత్వాధికారాన్ని త్యజిస్తూ, రిపబ్లికన్ పార్లమెంటు ఆదేశాలనుమాత్రం శిరసావహిస్తామని తీర్మానించారు. ఇంతవరకూ లోకల్ గవర్నమెంటుబోర్డుతో వుండే సంబంధాలను త్రెంచివేశారు.

ఈ సంస్థల పరిపాలనా వ్యవహారాలు, రిపబ్లికన్ పార్లమెంటు నియమించిన స్థానిక సంస్థలమంత్రికే తెలియపరుస్తూ, వారి ఉత్తర్వులను శిరసా వహించేవారు.

షిన్‌ఫీన్‌పక్షం ప్రజలలో బాగా నాటుకపోయి, ప్రజల ఆదరాభిమానాలు పొందుతూ వుండడం, బ్రిటిష్ వారు సహించలేక, స్థానికసంస్థలకు ఆదివరకటిదాకా యిస్తున్న గ్రాంటులను నిలిపివేశారు. కాని యీ చర్యకూడ, షిన్‌ఫీన్‌పక్షం మరింత బలపడటానికే సాధనమైంది. శాంతిరక్షణలో నేమి, న్యాయ న్యాయ విచారణలో నేమి, రిపబ్లికన్ న్యాయస్థానాలు, కార్యకలాపాలను క్రమశిక్షణతో సాగించి, ప్రజల మన్ననలకు పాత్రములైనాయి. బ్రిటిష్ హయాంలో, ఆచరణలో వున్నటువంటి, నీచమైన విధానాలన్నిటిని రిపబ్లికన్ ప్రభుత్వం రద్దు చేసింది.

అక్రమపద్ధతులకైన సారాయినిషేధాను చేయడం, కార్మికశాలల్లో పని చేయు కాలం నిర్ణయించడం, మొదలైన ప్రజోపయోగకరములైన అనేక పనులు రిపబ్లికన్ పార్టీ అమలుపర్చింది.

### ఒకరోజు సమ్మెలు

ఐరిష్ ప్రజలు, స్వాతంత్ర్య సముద్ధరణకు, తమ వాంఛితాలు యీ వేరటానికి, బ్రిటిష్ ప్రభుత్వంపై అసమ్మతి సూచకంగా, ఒక పర్యాయంమాత్రం ఒక్కరోజు సమ్మెచేశారు. యుద్ధసందర్భంలో, నిర్బంధ సైనికశిక్షణ, బ్రిటిష్‌ప్రభుత్వం అమలుపర్చ ప్రయత్నించినపుడు, ఐరిష్ ప్రజానీకం ఏకగ్రీవంగా తమ వ్యతిరేకతను ప్రకటిస్తూ, సమ్మెపిలుపు నిచ్చారు. "అల్స్టర్" లోని లాయలిస్టులు మినహాగా, అందరూ, అత్యధికోత్సాహంతో, యీ పిలుపునందుకొని, సమ్మెను దిగ్విజయముగాచేశారు. రైళ్లు, ట్రాములు, ఎక్కడివక్కడ నిల్చిపోయాయి. హోటళ్ళకు వచ్చినవారికి, ఫలహారా లందిచ్చేవారు లేకపోయారు.

ఘోరకసాక్షి, డబ్లిన్ జైలులో నిర్బంధంలో వున్న వందమంది షిన్‌ఫీన్ నాయకులను విడుదలచేయమని బ్రిటిష్ ప్రభుత్వాన్ని కోరగా, వారు నిరాకరించినందున, ఐరిష్ కార్మికపక్షం, ఒకరోజు సమ్మెసాగించవలసిందిగా, పిలుపునిచ్చింది. ఈ సమ్మె ఫలితంగా, ప్రభుత్వం దిగివచ్చి, షిన్‌ఫీన్ నాయకులను విడుదలచేసింది.

ఐరిష్ కార్మికపక్షం, రిపబ్లికన్ ప్రభుత్వంతో సహకరించి, షిన్‌ఫీన్ పక్షాన్నే బలపరుస్తూవచ్చింది. 1918 లో జరిగిన ఎన్నికల్లో, కార్మికపక్షంవారు పోటీ చేయలేదు. స్వపరిపాలనాధికారం, ఐరిష్ ప్రజలందరూ ఏకగ్రీవంగా వాంఛిస్తున్నారని పాజువుపర్చడానికే కార్మికపక్షం వారు ఎన్నికల్లో పోటీచేయలేదు.

1920లో ఐర్లెండులో ఆహారపదార్థాల కొరత తీవ్రంగా ఏర్పడి, పరిస్థితులు విషమరూపందాల్చినపుడు, కార్మికపక్షం నిర్వహించిన పాత్ర ప్రశంసనీయం. ఐరిష్ ప్రజలు ఆహార పదార్థాల కొరతతో, తీవ్రంగా బాధపడుతుండగా, లెక్కలేని ఆహార పదార్థాలను, బ్రిటిష్ ప్రభుత్వం, విక్రేతలకు ఎగుమతి చేసింది. ఒకరిక ఓడరేవులలోని కార్మికులు, యీ ఆహార పదార్థాల ఎగుమతి అడ్డగించేటందుకు తీవ్రంగా ఆందోళన చేశారు. దీని ఫలితంగా, ప్రజలకు కావల్సిన పదార్థాలు నిలువచేసి, స్వల్ప ధరలకు అందచేశారు.

ఐర్లెండు చరిత్రలో, కార్మికోద్యమం ప్రముఖపాత్రను నిర్వహించి, బ్రిటిష్ వారి ప్రయత్నాలకు తీవ్ర అవరోధాలు కలిగిస్తూ, ఐరిష్ స్వాతంత్ర్య సమరం చరిత్రలో, షిన్‌ఫీన్ పక్షానికి, చేదోడు వాదోడుగా, పనిచేసింది.

# గ్రంథ పరిచయం

## విజయనగర యాదవ సామ్రాజ్యము

రచయిత: శ్రీ ఎస్. ఆర్. నాగేశ్వరరావుగారు, యదుకుమార్ కార్యాలయము, గుడివాడ (కృష్ణాజిల్లా) పుటలు 26. వెల ఆరణాలు.

కాకతీయ సామ్రాజ్య పతనానంతరము రెండువందల సంవత్సరములకుపైగా మహమ్మదీయ సేనావాహినుల నరికట్టి, హిందూ ధర్మమును పోషించి రక్షించినట్టియు, ఆంధ్రుల తేజమును, పరిపాలనా సామర్థ్యమును, రాజనీతి ధురంధరత్వమును ప్రపంచములో ఆచంద్రార్కముగా నిలయించిన విజయనగర సామ్రాట్టులు యే పుణ్యవంశమునకు జెందినవారు? ఈ ప్రశ్నకు సమాధాన మొసంగి విజయనగరము నేలిన నాల్గు వంశములవారు యాదవులు అనగా గొల్లకులమువారని నిరూపించుటకు, ఈ గ్రంథము ప్రవర్తిల్లినది. సంఘములో వెనుకబడియున్న గొల్లకులస్థులకు వారి పూర్వఘనత జ్ఞాపకము చేసి అభివృద్ధికి దెచ్చుట గ్రంథకర్త ఉద్దేశము.

విజయనగర రాజులు యాదవులని చరిత్రకారులందరు అంగీకరించుచునే యున్నారు. చరిత్రకారులు పక్షపాతంతో విజయనగరరాజులు యాదవులని స్పష్టముగా వ్రాయకుండిరని గ్రంథకర్త తన 'ముందుమాట'లో గావించిన ఆరోపణ నిరాధారము. శాసనములు, ఆనాటి గ్రంథములు విజయనగరరాజులు యదువంశ సంజాతులని నుడువుచున్నవి. కొందరు శాసనములో చంద్రవంశమున బుధుడు, ఆయువు, నహుషుడు, యయాతి, యదువు జనించిరనియు, యదువంశములో హరిహరరాయలు జనించెననియు కలదు. సాళువాభ్యుదయ రచయిత సాళువవంశం వారు యదువంశమువారనుచున్నాడు.

శ్రీ కృష్ణరాయలు యదువు తమ్ముడగు తుర్వసుని సంతతివాడని అల్లసాని పెద్దన చెప్పుచున్నాడు. అరవీటి రామరాజు యయాతి సంతతివాడని వసుచరిత్ర చెప్పుచున్నది. అరవీటివంశస్థులు తమ శాసనములలో కురుసంతతివారని చెప్పుకొనుచున్నారు. ఈ నాల్గు వంశములు పరస్పర సంబంధము కలిగియుండుటచేత అందరు యాదవులనియే చెప్పవచ్చును.

చంద్రవంశముయొక్క చరిత్ర, అందున యదువంశచరిత్ర భాగవత నవమస్కంధములో పవిత్రముగా నున్నది. ఈ వంశజులు క్షత్రియులు. వసుదేవుడు క్షత్రియుడు, శ్రీకృష్ణుడు క్షత్రియుడు. పసుల కాపరియగు నందునియింట పెరిగినంత మాత్రమున శ్రీ కృష్ణుడు గొల్ల కాడుగదా! పాండవులు చంద్రవంశపురాజులే. పాండవులకును యాదవులకును సంబంధము న్నయెడల అవి క్షత్రియులకును క్షత్రియులకును మధ్య జరిగిన వివాహములుగాని అన్యం కావు. ఇప్పుడు మనము గొల్లలను యాదవులని పిలుచుచున్నాము. యాదవవంశము గొల్లకులమని భ్రమపడి గ్రంథకర్త ఈగ్రంథము వ్రాసినట్లు కనిపించుచున్నది. విజయనగర సామ్రాట్టులు యాదవులని వీరు నిరూపించిరిగాని గొల్లలనుటకు యెట్టి ఉపపత్తులను చూపియుండలేదు.

ఐన, విజయనగరరాజులు గొల్లకులస్థులు కారా? వారేకులమునకు జెందినవారు? అనుప్రశ్న ఉదయించును. కొందరు చరిత్రకారులు విజయనగర స్థాపనాచార్యులగు హరిహరరాయలు, బుక్కరాయలు గొల్ల కులస్థులనియే తలచుచున్నారు. డా॥ థర్స్టన్ తన గ్రంథములో 'Two brothers hindus of the Kuruba Caste' అని వ్రాసెను. (కురుబ అనగా కాపులు, పసుల కాపరులు, గొల్లలు (Castes and tribes of Southern India by Thurston P. 139) శ్రీ ఎస్. శ్రీకంఠయ్యగారు హరిహరరాయల తండ్రియగు సంగమని విషయమై ప్రస్తావించుచు 'Being a Kuruba by Caste, he is Said to belong to the yaduvamsa In the inscriptions most of which refer to him as a king. However his Sons brought reputation to the father whatever he may himself have been' అని నుడువుచున్నారు. యదువంశములో విజయనగరరాజుల సంబంధము కేవలము నామమాత్రమే యని తలపవచ్చును. డా॥ ఎస్. కృష్ణస్వామి అయ్యంగారు. The coannection with the Yadavas is no more than the usual association of the name with the Southern branches of the line of the moon' అని వ్రాయుచున్నారు. విజయనగర సామ్రాట్లకును రెడ్డిరాజులకును వివాహసంబంధ ముండుటచేత వారు చతుర్థ వర్ణజులనితలపవచ్చును.

గ్రంథకర్త విజయనగర రాజులు గొల్లలని నిరూపింపదలచినయెడల బలీయములగు ఉపపత్తులు చూపవలెను. వీరు చూపుచున్న ఉపపత్తులు విజయనగరరాజులు క్షత్రియులగు యాదవులని నిరూపించును గాని గొల్లకులస్థులని నిరూపింపజాలవు.

## 'పాడిపంటల' వైకుంఠపాళి

'కృషితోనాస్తి దుర్భిక్షం' అనే పరమసత్యాన్ని బుజువుచేసే వ్యవసాయపు సామెతలను, పాడి పంటలకు సంబంధించిన మెలకువలను ఆరోహణావరోహణక్రమంలో నిచ్చెనలకూ, పాములకూ సందర్భానుసారంగా అమరించి, ఆయా విషయాలు పామరులకుగూడ అర్థమయ్యేటట్లు చక్కని బొమ్మలుకూడ సమకూర్చి అచ్చం దాలా అసలు వైకుంఠపాళిని పోలునట్లు మద్రాసు వ్యవసాయశాఖ డైరెక్టరు ప్రకటించిన ఈపరమపద సోపానపటము అర్థగర్భితమై విజ్ఞానానికి ఉపకరింపగలదై యున్నది. దీనికి ఆంధ్రప్రజానీకంతో తగిన ఆదరణ లభిస్తుందనేఆశ. వెల రెండణాలు మాత్రమే. కావలసినవారు వ్యవసాయశాఖ డైరెక్టరు కార్యాలయం నుంచి తెప్పించుకోవచ్చు.

## రైతుబాబు

కృతికర్త: డాక్టరు పొంనూరి సాంబమూర్తి, శ్రీ ప్రసాద్ మెడికల్ ఫార్మసీ, రావులపర్రు—వెల 1 రూపాయి—డెమ్మీ 1/16, 44 పేజీలు—పద్యకావ్యం.

పుస్తకంమీద రాబడి పేదప్రజల ఉచితచికిత్సకు వినియోగించబడుతుందట.

ఈగ్రంథంలో మూడు ఖండాలున్నాయి. మొదటి రెండు ఖండాలలోనూ బాగాబతికి జమీందారుచేసిన ద్రోహంతో కష్టాలపాలైపడిన రైతు తన విషాదగాథను పల్లెలో చెప్పుకుంటాడు. మూడోఖండంలో జమీందారు హృదయ పరివర్తనవల్ల రైతు తిరిగి మాననీయస్థితికి వస్తాడు. కవిత్వం ఆహ్లాదకరంగా ఉంది.

## గేట్వేటు ఎస్ట్రాలజీ

ఆంగ్లగ్రంథం- రచన: వి. సీతారామశర్మ కల్పతరు పబ్లికేషన్స్, బలేపేట, బెంగుళూరు 2—వెల (పోస్టేజీ కాక) 2 రూపాయలు.

140 పేజీలుగల ఈ గ్రంథంలో జ్యోతిషశాస్త్రం యొక్క ప్రాథమిక సిద్ధాంతాలన్నీ సమగ్రంగానూ, విస్పష్టంగానూ ఇవ్వబడినవి. స్వయంగా ఈ శాస్త్రంలో ప్రవేశం సంపాదించ దలచినవారు చదువదగిన పుస్తకం.

# భారతీయ నాటకకళ

[5 వ పేజీ తరువాయి]

విస్తారపూర్వకంగా చిత్రించే చరిత్ర చిత్రణ నాటకములో సజీవంగా తక్కువ కాలపరిమితిలో చిత్రించబడివుంటుంది. చరిత్ర చిత్రణేనాటకములో ప్రధానమూ, స్థాయిత్వమూను. డి. యల్. రాయ్, నాటకాలింత ప్రసిద్ధిచెందినవంటే వాటిలోని ప్రధానమంతా చరిత్ర చిత్రణే. ఈయన నాటకాల్లో ముఖ్యంగా పాత్రధారుల భావాలవికాసమే చూపించబడివుంటుంది.

నాటకకారుడు కొన్ని దృశ్యాల్లోనే నిపుణత్వముతో చరిత్రచిత్రణ చూపించాలి, కథనుకూడా ముగించాలి. నాటకములోని ప్రతి ఒక పాత్రధారునిస్వరూపమూ కథావస్తువు కుపయుక్తంగా యుండాలి. పూర్తి నాటకమువీద ప్రభావాన్ని వజల్లు నాయికానాయకు లెవరైనాసరే వీరి విశేషప్రదర్శన మవసరము. యీ విషయములో నవలాకారునికంటే నాటకకారుడు డెన్నోకష్టాల నెదుర్కోవలసి వస్తుంది. నవలాకారు డవసరమొచ్చినపుడెల్లా తన పాత్రధారుల భావాల్ని టీకాటిప్పణిద్వారా స్పష్టీకరిస్తాడు. కానీ నాటకకారుడు యీ పని కేమాత్రం సాహసించడు. పాత్రధారుల చరిత్రచిత్రణకోసం నవలాకారుడు తనపైపురుషంచీకూడా కొన్ని మాటలనే స్తాడు. దీనికి బదులు నాటకకారుడు స్వయంగా తన కథావస్తువుయొక్క పాత్రల కథోపకథనంతోనే ఈ పని చేయగలుగుతాడు.

నవలలో చరిత్రచిత్రణ రెండువిధాలు విశ్లేషణాత్మకములేక సాక్షాత్తు 2 అభినయాత్మకము లేకపరోక్షము సాక్షాత్తులో లేఖకుడు టీకాటిప్పణిసహాయంతో పాత్రల చరిత్రచిత్రణ స్పష్టీకరిస్తాడు. పరోక్షములో పాత్రల సంభాషణద్వారా తన చరిత్రచిత్రణ స్పష్టీకరిస్తాడు. నాటకంలో యీవిధంగా చేయడానికి వీలులేదు. నాటకములోని నాయికా లేక నాయకుని గుణాలు మహోత్కృష్టంగా వుండాలి. ఆధునిక నాటకకళ ననుసరించి నాటకములోని నాయకుని భార్యనే నాయిక అనడానికి వీలులేదు. నాటక కథలో ప్రధాన భాగస్తురాలినే నాయిక అంటారు. కానీ భారతీయ నాట్యశాస్త్రములో నాయకుని భార్యనే నాయికను చేయాలి. నాయకుని సామాన్యగుణాలు ఆమెలోకూడా చూపించాలి. నవలా రచయిత టీకా టిప్పణిద్వారా పనిచేసే స్థలాల్లో, నాటకకారుడు స్వగతము ద్వారా చేస్తాడు. ఏ పాత్రధారుని ఆచరణనైనా మనం గుర్తించవలసినపుడు అతని ఆంతరంగిక భావాల పరిచయ మావశ్యకము ఈపని స్వగతము నెరవేరుస్తుంది. కానీ పాశ్చాత్య సాహిత్యదృష్ట్యా స్వగతము అనుచితమంటారు. ఒకవేళ స్వగతములో అవసరమొస్తే మరోపాత్రను ప్రవేశపెట్టి అందులోని భావాన్ని బయటపెట్టే అనుకూలాన్ని కలిగిస్తారు.

'ఆకాశవాణి, ఇదికూడా మన భారతీయ నాటక కళలో ముఖ్యాంగము. ఇది పాశ్చాత్యుల సాహిత్యములోలేదు. మన ప్రతిపౌరాణిక నాటకంలోనూ ఆకాశవాణి అక్కడక్కడ వినిపిస్తూవుంటుంది. ఈవిధంగా నవలానాటకాలను తులనాత్మకంగా చూస్తేఎంతైనా భేదావుంది. ప్రాచీనభారతీయనాటకకళకు,పాశ్చాత్య ప్రభావంతో కూడుకొన్న ఆధునిక నాటకకళకూకూడా చాలా భేదముంది. ఇక మనం ప్రాచీన నాటక కళోత్పత్తీ దాని పతనం, మరి అభ్యుదయాన్ని గురించి ఆలోచిస్తాము.

ప్రాచీనకాలంలో ప్రజలు ఫసల వర్షానికీ, చలికీ భయపడి దేవతారాధన చేసేవారు. ఆరాధన సమయములో నృత్యగానాలుకూడా చేసేవారు. అప్పటికీ చలీ వర్షాల తీక్షత తగ్గకపోతే ఆరాధన విడచి ధార్మిక ఉత్సవాల్ని చేసేవారు. ఈ ఉత్సవాల్లోకూడా నృత్యగానాలుండేవి. ఈ నృత్యగానాలతోనే నాట్యకళోత్పత్తి అయింది.

ప్రపంచమంతటిలో అన్ని విషయాల్లోనూ ముందంజవేసిన భారతదేశం నాట్యకళలో కూడా ముందంజ వేసింది. పాణినీ, పతంజలి సమయంలోనే భారతీయ నాట్యకళ పరిపూర్ణంగా వికసించింది. చాలా లోతుకు దిగిచూస్తే నాట్యకళ వేదాలు పుట్టిన కొన్ని దినాలుకే వైదిక కాలములో పుట్టి కొద్ది కాలంలోనే అభివృద్ధి చెందిందని తేలుతుంది. మొదటి నాటకకళ ఒక వినమయిన తోలుబొమ్మలతో ప్రారంభమయింది. రానురాను రంగశాలల మీదికొచ్చాయి యీ తోలు బొమ్మలు. యిప్పటికీ ఈ తోలుబొమ్మలాంటి ఒక్కడిక్కడ సాగుతూనే వున్నాయి. యీ బొమ్మలాటకు కథ రామాయణమో, లేక భారతమో, అయివుంటుంది. పదహారు పదునేడవ శతాబ్దములో దక్షిణప్రాంతములో యీ బొమ్మలాట లెక్కువ ప్రసిద్ధి చెందినవి. యూరపు ఖండాల్లో మధ్యయుగంలో ఆడబడుచున్న బొమ్మలాటలు భారతదేశాన్ననుకరించే వుండేవని 'ప్రొఫెసర్ ఫిషల్' అన్నాడు.

ఇప్పటికి ఆరునూర్ల సంవత్సరాలకు ముందు యూనానిదేశంలో నవ్యప్రథమ నాటకాలు వ్రాయబడినాయి. అదేసమయంలో భరతముని, లక్షణగ్రంథాన్ని తయారుచేసినాడు. దీనివల్ల ఆనాటికే భారతీయ నాట్యకళ పూర్ణరూపముతో వికసించిందని చెప్పవచ్చు. భారతవాసులు యూనానివారినుండి నాట్యకళ నేర్చుకొన్నారని కొంతమందికి భ్రమ. యూనానిదేశంలో నాట్యకళ పాలుత్రాగి పారాడేసమయంలో భారతీయ నాట్యకళ పదహారేళ్ళ ప్రాయములోనున్న పట్టపగ్గాలు లేనిపడుచు, బహుశా, పరదాలు మొదలయిన వేవయినా యూనానివారితో గ్రహించుకొని వుండవచ్చు లేదా, పరదాకుద్ద యూనానిదేశంలో తయారైనది కావచ్చు. ఇందువల్లనే పరదాకు యవనికా అని పేరుకూడా పడి ఉండవచ్చు.

క్రీస్తుశకము పదియవ శతాబ్దము తరువాత సంస్కృత సాహిత్యంలో అత్యుత్తమ నాటకాలు తయారయివుండినవి. వాటిలో ప్రపంచంలో ప్రసిద్ధికెక్కిన భారతదేశపు నాటకాలెన్నో వున్నాయి. 'అభిజ్ఞాన శాకుంతలము, కూడా అందులో ఒకటి. కానీ వీటిలో ఎన్నో భేదాలుండేవి. నాటకము ప్రకరణము, భాణము, ప్రహసనము, డిమము, వ్యాయోగము, వీథి, అంకము, ఈహామృగము, మొదలైనవిగా యుండేవి...వీటికి లక్షణాలేమిటంటే!

నాటకము :—కథ చరిత్ర ప్రసిద్ధమయి నదియై ఎంతో వ్యాపంగావుంటుంది.

ప్రకరణము :—కథ కల్పితమైలౌకికంగా వుంటుంది. నాయకుడు ధీరుడుగానూ శాంతస్వభావుడుగానూ వుంటాడు.

భాణము :— ఒకే అంకము, ఒకే పాత్రధారు డుంటాడు. నాయకుడు బుద్ధిమంతుడయినవిటుడు. వాక్పటుత్వముతో అందరినీ లోబరుచుకొను శక్తిగలిగి ఉంటాడు.

ప్రహసనము :— ఇది భాణముమాదిరి వుంటుంది. కానీ హాస్యరస ప్రధానంగా వుంటుంది.

డిమము :— కథ చారిత్రకంగా ఉండి, మాయాజాలాది విశేషాలుంటాయి. నాయకుడు గంధర్వుడు, దేవత, భూతపిశాచాలై వుంటాడు.

వ్యాయోగము :— కథ పురాణమయినా సరే ఇతి హాసమయినాసరే ప్రసిద్ధిచెందినదిగా యుంటుంది. నాయకుడు ధీరోదాత్తుడైన, రాజర్షి లేదా దివ్యపురుషుడు.

వీథి: ఒకే అంకము. ఒకరో ఇద్దరో పాత్రనాయకులు, ఉత్తమ మధ్యమ పురుషుల్లో నాయకుడై ఉండాలి.

అంకము : ఒకటే అంకము. నాయకుడు సాధారణపురుషుడు. స్త్రీల విలాప మెక్కువగాయుండి కరుణరస ప్రధానంగా ఉంటుంది.

ఈహామృగము : దీనిలో నాయకుడు హరిణిమాదిరి నాయికను వేటాడి వాంఛించును. అంకములు నాలుగు, నాయకుడు ప్రసిద్ధ ధీరోదాత్త గుణాలుగలవాడు లేదా దేవత అయివుండాలి.

ఇన్ని లక్షణాలకో సాగివస్తున్న నాటకకళ మహమ్మదీయుల దాడితో పతనమై పోయింది. కరుకుతురక లాకాలానికపరిచితులు. మతసర్వాత్మసారంగా నాటకకళను నీచంగా భావించేవారు. ఇందువల్ల పదునాలుగవ శతాబ్దినుండీ లుప్తప్రాయమై పోయి పంతొమ్మిదవ శతాబ్దిలో భారతదేశపు భాష లన్నిటిలోనూ నాటకరచన సాగింది. అన్నిటికంటే బెంగాలుదే ముందంజ. కానీ నాటకకళాకారులంతా సినీమాప్రపంచములో విహరించుతూ నాటకకళకు తగినంత ఆదరణ చూపించక పోవడముతో నాటకకళ ఏనాటికైనా మందగిస్తుందేమో నన్న సందేహం, ప్రతి వ్యక్తికీ వుంది. నాటకకళాకారులంతా తమ బాధ్యత నిర్వర్తించక పోతే నాటకకళకు పతనం తప్పదేమో!

## మధ్యభారతరాజధాని సమస్య తేల్చటానికి సలహా సంఘం

గ్వాలియర్, ఏప్రిల్ 22: మధ్యభారత యూనియన్‌కు రాజధానిగా, ఇండోర్ బాగుంటుందో, గ్వాలియర్ బాగుంటుందో పరిశీలించి సలహా చెప్పటానికి ప్రభుత్వం ఒక ఉపసంఘాన్ని నియమించింది. ప్రస్తుతం ఇందోరు, శీతవసంత కాలముల రాజధానిగా మాత్రం వుంటున్నది.

## రాజస్థాన్ యూనియన్

రాజకోట, ఏప్రిల్ 22: రాజకోట యూనియన్ తాలూకు సంస్థానాధీశులు ఈవేళ ఆ భూపర్వతంవద్ద సమావేశమవుతున్నారు. వారి ఐదుమాసాలకుగూర్చి, అధికారాలనుగూర్చి చర్చించుకుంటారు. ప్రభుత్వప్రతినిధిగా వి. పి. మీనన్ సమావేశానికి హాజరౌతున్నారు.

# శరణార్థులు

5 వ పేజీ తరువాయి

నడుస్తున్నవాడు హఠాత్తుగా ఆగిపోయాడు. అతి జాగ్రత్తతో మాత్రం నేలమీద కాళ్ళనివుంచి, చతికిలపడ్డాడు. పెరాకాళ్ళ రెంటి మధ్య తీవెట్టుకు ఊపిరిలో సంకోట్టుకున్నాడు. ప్రక్కనే తినుబండారాలు అమ్ముకుంటూన్నవాడు "ఆలూపూరీ! చుట్టలబాజీ! మచిలీ బాజీ! గరమ్ గరమ్ చాయీ!" అని కేక వేశాడు.

ఆదారిని పోతూన్న పాంథునికంట బడ్డాడు ముసలివాడు. అతనాగి "ఎంతమందికని దానంచేయగలను! ఎటు చూచినా దారిద్ర్యమే తాండవిస్తూంది. ఈ ముసలివానిని చూస్తే మా నాన్న జ్ఞాపకం వస్తున్నాడు!" అని జేబులోంచి ఒక అర్ధరూపాయికాసుతీసి "తాతా! ఇదిగో! ఆలూపూరీ గరమ్‌చా కొనుక్కో" అన్నాడు.

ముసలివాడు తలెత్తి ఆపాంథునిపైపు చూశాడు—కాని చేయి చాచలేదు కృతజ్ఞతతో.

"బాబూ! నేను చేయిచాచి బిచ్చమడగలేదే!......బాబూ! మాకుమంచి పొలంవుంది. మేమెప్పుడూ - భూదేవి చల్లగా - కరవనేది ఎరగము......మంచి పొలంబాబూ!....కాని....కాని....ఈ బొంబెలో ప్రాణంవుండగా నాపొలాన్ని విడిచి వుండేవాణ్ణికాను......కాని విత్తు గింజలుకూడా లేకుండా వాళ్ళు తగలపెట్టేశారు......విత్తుగింజలే ఉంటేనా-ఏమైనా సరే — నా పొలాన్ని విడిచి ఇలా వచ్చేవాణ్ణా బాబూ!"

"తాతా! ఇదిగో ఈ డబ్బు తీసుకుంటావా లేదా?......తీసుకున్నా సరే లేక పోయినా సరే...ఇదిగో ఈ బొంత మీద పడేసి పోతున్నా"

చాయీవాలా టీ తయారు చేసి, ఏయ్ తాతా; ఇదిగో కప్పు టీ...ఏమన్నా తిండానికి ఇమ్మంటావా? అని అడిగాడు.

ముసలివానిలో కొంత చలనం కల్గింది. అర్ధరూపాయ కాసు కోసం బొంత తిరిగి, ఓ కప్పు చా చాలు బాబూ! అన్నాడు.

"కప్పు చా కడుపు నింపుతుందా తాతా?"

"నాకోసం కాదు బాబూ" అన్నాడు ముసలివాడు ఎవరికోసమో తెలియక ఆశ్చర్యంతో చాయీవాలా నలుమూలలా వెతకసాం మొదలెట్టాడు.

ముసలివాడు, వణికిపోతూ, లేవ లేక లేవ లేక లేచి, వణుకుతూన్న చేతితో టీ కప్పు పట్టుకు, గోనె కప్పిన గంపదగ్గరకెళ్లి కూర్చుని గోనె ఒత్తిగించి "బాబా! బాబా! ఇదిగో చా త్రాగు నాయనా! నాబాబు! త్రాగరా? అని" కొన వూపిరితో ఉన్న ఒక అర్భకుని పెదాలకి ఆ కప్పు అందించాడు.

చాయీవాలా ఆశ్చర్యచకితుడై "నీ మనమడా?" అని అడిగాడు. 'ఔను' అన్నట్లు ముసలివాడు తల వూపాడు.

"నా ఒక్కగాని ఒక్క కొడుకు కొడుకు వీడు బాబూ! నా కొడుకూ నా కోడలూ కూడా చంపబడ్డారు!"

పిల్లవాడు టీ త్రాగగానే తిరిగి గోనె జాగ్రత్తగా కప్పాడు. కప్పులో కొంచెం మిగిలిన టీ తో తనగొంతు తడుపుకొని, కడుపునిండావిందారగించిన సంతృప్తితో, తిరిగి ఆకప్పు చాయీవాలా కందిచ్చి, అర్ధరూపాయి ఇచ్చాడు.

"నువ్వేమీ తినలేదు. తాగాలేదు... మరి నీకు ఆకలి వేయడంలేదూ?"

"నాకేమీ వద్దు బాబూ! మిగతా చిలర ఇచ్చేయి... ఈ కాసిని డబ్బులతోటే నాకడుపు నింపుకుంటే పొలం దున్ని ఏం జల్లమంటావు?

.........విత్తనాలు కొనక్కనేందుకు ఈడబ్బులు నాయుపయోగపడతాయి బాబూ!"

"నేను కూడా, నీలాగ పేదవాణ్ణే కాకపోతే నీ దగ్గర ఈ కప్పు చాకీ డబ్బు పుచ్చుకుని వుండే వాణ్ణి కాదు తాతా! ఏం చేయను!"

"తమ్ముడూ! నీ అసహాయతకి, నీవేమీ చింతిల్లకు, దగ్గరున్న డబ్బులు నెచ్చించి నేను ఎందుకు ఆకలి తీర్చుకోలేదనే కదా నీ సంజాటన! నీకూడా ఓ కొంచం నేలవుంటే అప్పుడు తెలుస్తుంది, విత్తనాల విలువ!...మేము మళ్ళీ మా వూరు వెళ్లిపోతాము. అప్పుడు విత్తనాలు లేకపోతే తిరిగి, మలమల మాడిపోతాము. ఈ కుర్ర వాగన్న వున్నాడే, నా మనుమడికి, నేను చేయతగిన సాయం ఒకటే: విత్తులు సంపాదించి పెట్టడం. నేను బ్రతికి వుంటే నేనే భూమి దున్ని విత్తనాలు జల్లి పంట పండిస్తా, లేదూ, ఒక వేళ నేను ఈలోగానే చనిపోతానా ఫర్వాలేదు, విత్తనాలు సంపాదించి ఉంచానంటే, ఎవరేనా, వాడికి సాయపడి, తిరిగి భూమి మీద నాల్గు గింజలు జల్లిస్తారు!"

మళ్ళ, ముసలివాడు కావిడి ఎత్తుకుని వణికి పోతూ, తూలి పోతూ, నడక సాగించాడు.

(పెరల్ బక్ చదివి)

# వారఫలాలు

ఏప్రిలు 24 వ తేదీ మొదలు ఏప్రిల్ 30 వ తేదీ వరకు

### గ్రహస్థితి

రవి-కుజ శుక్ర-రాహువులూ 27 వరకు బుధుడూ (మేషం) గురువు (మకరం) శని (సింహం) చంద్రుడు (కుంభ, మీన, మేష, వృషభాల్లో) 24 కుజ-రాహువు 27 రాహుచంద్ర-కుజ-చంద్ర 28 రవి చంద్ర-శుక్ర-చంద్ర 30 బుధ-చంద్ర (యుతి) 29 కుజ-శని (కోణం).

### విశేషములు

28 వ తేదీ గ్రహషట్క సంబంధం మేషంలో హైందవ రాజకీయ నైతిక మార్పులను సూచిస్తుంది. వైదేశిక వ్యాపారములతో పరస్పర ఒడంబడికలు కుదురుతవి. పలు ప్రదేశములలో అగ్ని పిడుగులు నేలయదురుట మొదలగు వానివల్ల ప్రమాదములు కలుగును. కాశ్మీరు పరిస్థితులు ఆందోళనను కలిగించును.

### ధరలు

ప్రత్తి నిలకడ - వెండి బంగారములు స్వల్పముగా హెచ్చును. వాటాలు మరి కొంత తగ్గును.

### లగ్నఫలాలు

**మేషం** (అశ్వని,భరణి,కృత్తిక,1వపాదం)

ఈ వారంలో పరిస్థితులు ఇంచుమించు గత వారాంతంలోలాగే యుంటవి. 27 ఉదయంవరకు ఖర్చులకు మితి యుండదు. అప్పులవారివల్ల తొందర కలుగుతుంది. బంధువులు ఆశాభంగం కలిగిస్తారు. 27, 28, 29 ల్లో అనేకులకు జవాబు చెప్పలేక విసుగు కలుగుతుంది. కాని మిత్రులవల్ల సౌఖ్యం కలుగును. గృహవిషయమైన చింత కలుగుతుంది. 30 న మనస్సు నిలకడ యుండదు. 27 న నవగ్రహశాంతి జరుపుకోండి.

**వృషభం** (కృత్తిక 2, 3, 4 రోహిణి మృగశిర, 1 2 పాదాలు)

ఈ వారంలో పరిస్థితులు గమనించడం అవసరం. 24, 30 ప్రయాణానికి 25, 26, 27 పరిష్కారాలకూ వ్రాతలకూ మేలు. రాజకీయాల్లో ప్రవేశం గలవారికి యోగకాలం. 27, 28 ల్లో పశువులకూ పిల్లలకూ బాధ కలుగుతుంది. ఏది ఎలా వున్నా పలువురికి సహాయపడే అవసరం కలుగుతుంది. సంఘంలో మీ ప్రజ్ఞ ప్రసంశింపబడగలదు. 27 వ్యయంలో గ్రహషట్క యోగం ఉత్తరోత్తరా విపరీత ఖర్చులనూ ధనవ్యయాన్నీ సూచిస్తుంది.

**మిథునం** (మృగశిర 3, 4 పాదాలు ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

ఈ వారంలో ఉద్యోగవృత్తి పరిస్థితులు గతవారంలోకన్నా మేలుగా యుండవ కలవు. బద్ధకంతో కార్యక్రమం ఆరంభించెదరు. కాని లాభకరమైన మార్పులు అగపడటంవల్ల క్రమేణా చురుకు హెచ్చుతుంది. వ్యాపార స్పెక్యులేషన్లు లాభకరం. ఆరోగ్యంగతవారంలోకన్నా మేలు. 26 వరకు ప్రయాణానికి 27, 28, 29 పరిష్కారాలకూ వ్రాతలకూ అనుకూలం. 30 మిత్రులకొరకై ప్రయాస. విలాస విహారాదులకు ధనవ్యయం.

**కర్కాటకం** (పునర్వసు 4, పుష్యమి ఆశ్లేష)

ఈ వారంలో 27 ఉదయం వరకు పరిస్థితులు గమనించడం అవసరం. ఆరోగ్యం సరిగా యుండదు. శరీరానికి మనస్సునకూ తాపాధిక్యత కలుగుతుంది. పంథు స్వజనాలలో జోక్యం వద్దు. కలహాలకు వీలుంటుంది. 28, 29 ల్లో ప్రయాణం-గౌరవస్తులను కలవడం లాభకరం. రాజకీయాల్లో ప్రవేశం కలవారు గొప్ప సమస్యలను ఎదుర్కొనడం కలుగుతుంది. 30 పరిష్కారాలు లాభకరం.

**సింహం** (మఖ, పుబ్బ, ఉత్తర 1 పాదం)

ఈ వారంలో పరిస్థితులు గమనించడం అవసరం. మీ భావిజీవితంలో నూతన మార్గాన్ని సూచించే మార్పులు అగపడుతవి. ఆప్తబంధువులకు ఆరోగ్యభంగం కలుగుతుంది. ఉద్యోగ నౌకర్లల్లో అతృప్తి కరమైన సంఘటనలు రేగుతవి. మొత్తం మీద 27 నవగ్రహశాంతి మేలు కలిగించకలవు. 24, 30 ప్రయాణానికి - ఆప్తులనూ గౌరవస్తులనూ కలవడానికీ మేలు. 30 శుభవార్త.

**కన్య** (ఉత్తర 2 3 4 పాదాలు హస్త, చిత్త 1, 2 పాదాలు)

ఈ వారంలో పరిస్థితులు ఇంచుమించు గతవారంలోలాగే యుంటవి. 27 ఉదయం లోగా ముఖ్య కార్యక్రమం ముగించడం అవసరం. 24 పరిష్కారాలకూ 25, 26 ప్రయాణానికి మేలు. 27, 28, 29 ల్లో ఆరోగ్యభంగం-అధికవ్యయం -మనో వ్యాకులం కలిగే సూచనలున్నవి. నరముల బలహీనత వారాంతంలో ఎక్కువ. ఆర్థికపరిస్థితులు యథాతథంగా యుంటవి.

**తుల** (చిత్త 3, 4 పాదాలు, స్వాతి విశాఖ 1, 2, 3 పాదాలు)

ఈ వారంలో పరిస్థితులు గతవారంలో కన్నా మేలుగా అగపడుతవి. ప్రతికక్షుల శృంగభంగం ప్రత్యక్షంగా చూచెదరు. కుటుంబంలో భార్యకుగానీ ఆమె స్త్రీ ప్రవారికిగానీ అకస్మాత్ ఆరోగ్యభంగం-భూగృహసంబంధమైన చిక్కులూ విశ్రాంతినివ్వవు. రాజకీయపరిస్థితుల్లో ప్రవేశం కలవారికి దూరప్రయాణం కలుగుతుంది. 25, 25 పరిష్కారాలకూ 28 వ్రాతలకూ మేలు. 25 శుభవార్త.

**వృశ్చికం** (విశాఖ 4 పాదం, అనూరాధ జ్యేష్ఠ)

ఈ వారంలో 27 మేషంలో గ్రహషట్కయోగం వచ్చే నాలుగుమాసాలలో ఋణంచేసి వ్యాపార స్పెక్యులేషన్లు జరుపవద్దని సూచిస్తుంది. మీకు ఇంతవరకూ అపకారం చేసినవారు బాధలో యున్నట్లు వార్తలు రాగలవు. 27 ఉదయం వరకూ శరీరతాపం ఉష్ణాధిక్యతా పిత్తలికారం, ఎక్కువగా యుంటవి. శరీరానికి మించిన పని పెట్టుకొనవద్దు. 28, 29 ల్లో డబ్బు చెలామణీ అనుకూలం కాగలవు. వారాంతంలో ఆప్తులను కలుస్తారు.

**ధనుస్సు** (మూల, పూర్వాషాఢ ఉత్తరాషాఢ 1 పాదం)

ఈ వారంలో పరిస్థితులు ఇంచుమించు గతవారంలో లాగే యుండకలవు. ధర్మకార్యాలకు ఆటంకాలు ఎక్కువ. బిడ్డలకూ వృద్ధులకూ ఆరోగ్యభంగం అకస్మాత్తుగా కలుగుతుంది. ప్రయాణాలు సాగవు. మూరంలో ఆప్తులవద్దనుండి వార్తలు రాక ఆందోళన కలుగుతుంది. ఆర్థిక పరిస్థితులు యథాతథంగా యుంటవి. 24, 30 పరిష్కారాలకూ వ్రాతలకూ మేలు. 24 శుభవార్త.

**మకరం** (ఉత్తరాషాఢ 2, 3, 4 పాదాలు శ్రవణం, ధనిష్ఠ 1, 2 పాదాలు)

ఈ వారంలో యితరుల సహాయాన్ని నమ్మి కార్యభారం పైనవేసి కొనవద్దు. కుటుంబ ఆర్థికపరిస్థితులు గతవారంలో లాగే యుంటవి. ఆరోగ్యం కొంత తగ్గుతుంది. మిత్రులు ఆశాభంగం కల్గిస్తారు. వృత్తి ఉద్యోగాలలో విశ్రాంతియుండదు. 25, 26 పరిష్కారలకూ వ్రాతలకూ ప్రతికూలం. ప్రయాణం అనుకూలం.

**కుంభం** (ధనిష్ఠ 3,4 పాదాలు శతభిషం పూర్వాభాద్ర 1, 2, 3 పాదాలు)

ఈ వారంలో పరిస్థితులు ఇంచుమించు గతవారంలో లాగే యుంటవి. ఆరోగ్యం సరికాని పరిస్థితుల్లో ప్రయాణం చేయడం కలుగుతుంది. ఆప్తులనూ గౌరవస్తులనూ కలుస్తారు. వ్యాపారాదుల్లో కొంత అనుకూలమైన మార్పులు కలుగును. 24 ప్రయాణానికి 27, 28 పరిష్కారాలకూ మేలు. 27 శుభవార్త.

**మీనం** (పూర్వాభాద్ర 4 పాదం ఉత్తరాభాద్ర, రేవతి)

ఈ వారంలో మీరు మీ కుటుంబ ఆర్థికపరిస్థితులను అత్యంత జాగ్రతతో గమనించడం అవసరం. రావలసినడబ్బు చేతికి రాకపోవడం ఇవ్వవలసినవారు త్వరచేయడం కలుగుతుంది. ఇతరులకు చెప్పుకోలేక మనస్సులోనే కృంగిపోయే పరిస్థితులు కలుగుతవి. 27, 28 ల్లో నవగ్రహశాంతి మేలు కలిగించకలవు. ఆరోగ్యం నిలకడగా యుంటుంది. 30 శుభవార్త.

ప్రజాభ్యుదయమే ఏ ఉద్యమానికయినా పరమలక్ష్యమని ఉద్ఘోషించే

# శ్రీ బూర్గుల రామకృష్ణరావు



సంస్థాన రాజకీయాల్లో ఏదయినా సమస్యలేగినా, సందేహం వచ్చినా పత్రికావిలేఖరులు సామాన్యంగా కాచీగూడెం వేపు పోతారు. అక్కడే హైవేస్టేషనుకు సమీపంగా శ్రీ రామకృష్ణరావు గారి నివాసం. ఏ నిమిషాలు ఆయనతో సంప్రదిస్తేచాలును, సక్రమమార్గం తోస్తుంది.

రామకృష్ణరావుగారి ప్రతిభ, నిశిత దృష్టికలవారికి సులభంగా కనిపిస్తుంది. ఆయన మేధాసంపత్తి అనుపమానం, పరిస్థితులను ఆయన అర్థంచేసుకున్నట్లు మరెవ్వరూ చేసుకోలేరు. నూటికి నూరుపాళ్లూ రాజకీయ చాతుర్యాన్ని జీర్ణించుకున్నాడు. ఏ భావాలకు ఆలవాలమైన హైదరాబాదు సంస్థానంలో, ఆయన అందరి అభిమానపాత్రుడు కావటానికి కారణం పంచభాషాప్రావీణ్యమే. వ్రాయగలడు. ఉపన్యసించగలడు.

స్వరూపం యెంత సంకుచితమైనా, దృష్టి అంతవిశాలము. పేరు విన్నతర్వాత కొత్తగా చూడబోయినవారికి ఆయన్ని చూడగానే విభ్రాంతి కలుగుతుంది. సంభాషణలో కాని అసలు సంగతి బయటపడదు. గాలిలోపుట్టి తుపానులో పెరిగిన సంస్థాన కాంగ్రెసు రాజకీయాల్లో యీయన పేరు పదేపదే వింటాము.

1899 మార్చి 13 తేదీన పుట్టుక. ధర్మవంతపాఠశాలలోనూ, నిజాము కాలేజీలోనూ విద్యాభ్యాసం. విద్యార్థి దశలోనే ముందుముల నరసింగరావుగారితో కలిసి యంగ్ మెన్సు యూనియన్ స్థాపించారు. ఒక విధంగా సంస్థాన రాజకీయాలకు ఈ సంస్థ మూలకందమని చెప్పవచ్చును. తరువాత పూనాలోని ఫెర్గుసన్ కాలేజీలో పట్టభద్ర పరీక్షకు చదివారు. ఆరోజుల్లో మహాత్ముడి సత్యాగ్రహ సంరంభ ప్రారంభం. ఆయన ఆదేశానుసారం ఖద్దరు ధారణ అవలంబించాడు. బొంబాయి విశ్వవిద్యాలయంలో న్యాయవాద పట్టాన్ని పొంది 1923 లో తిరిగి సంస్థానం వచ్చేశాడు. కెసి డెన్సీ కోర్టులో యీయన ఖద్దరు కట్టుకున్నాడనే కారణంచేత ప్రవేశార్హత లభించలేదు. ఏడాదిన్నరవరకూ న్యాయవాద వృత్తి సాగించలేకపోయినారు. ఖిలాఫతు ఉద్యమంలోచేరి రాజకీయంగా ప్రాముఖ్యం పొందారు. ఆంధ్రజనసంఘం ప్రథమ సమావేశానికి, నిజామాంధ్ర పితామహుడైన శ్రీ మాడపాటి హనుమంతరావుగారితో పాటు హాజరయ్యారు. ఆ సంఘ ప్రాబల్యానికి తోడ్పడ్డారు. ఆరోజుల్లో ఆంధ్రాభ్యుదయానికి పాటుపడే సంస్థ అదొక్కటే.

రామకృష్ణరావుగారు మొదటినుంచీ మత సామరస్యానికి శక్తివంచనలేకుండా శ్రమించారు. ఆయనతో సంబంధం పెట్టుకోని రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక సంస్థ ఒక్కటీలేదు. ఆంధ్రమహాసభకు కార్యదర్శిగా పనిచేశారు. దేవరకొండలో జరిగిన రెండవ సమావేశానికి అధ్యక్షత వహించాడు. ఆరోజున ఆయన చేసిన అధ్యక్షోపన్యాసం నేటికీ చిరస్మరణీయమే.

న్యాయవాదిగా గణుతికెక్కాడు. ప్రాక్టీసు విపరీతంగా పెరిగిపోవటంవల్ల, రాజకీయాల్లో నిమగ్నం అయిన ఆయన మనస్సుకు కేసుల్లో పనిచెయ్యటానికి తీరిక చిక్కేదికాదు. దావాదార్లకు ప్రాణసంకటంగా ఉండేది. ఆయనలో వారికి విపరీతవిశ్వాసం. ఆయనకి తీరికలేదు. కోర్టుకుపోతూ దార్లో కేసుల్ని పరిశీలించేవాడు. న్యాయస్థానంలో ఓటమి సామాన్యంగా యెరుగడు. ఎంతటి క్లిష్టమయిన కేసయినాసరే ఒక్క చూపుతో భేదించగలడు. ఆయన న్యాయవాదిగా సంపాదించుకున్న పేరది.

హైకోర్టు న్యాయమూర్తిపదవిని స్వీకరించవలసినదిగా ప్రభుత్వం కోరినప్పుడు నిరాకరించాడు. ఆతరవాత మంత్రివర్గంలో

‘వరద’

చేరమన్నా చేరలేదు. ప్రభుత్వాన్ని ప్రజాయత్తం చెయ్యనంతవరకూ తనకే పదవీ అక్కర్లేదని ప్రభుత్వానికి తెలియచేశారు.

1948 తరవాత మొత్తం మూడుసార్లు అరెస్టుఅయినాడు. మొదటి రెండుసార్లు శిక్షించకుండా విడిచివేశారు. మూడోసారి మూడుమాసాలు నిర్బంధం అనుభవించాడు.

స్టేటు కాంగ్రెసు స్థాపకుల్లో ప్రముఖుడీయన. కాంగ్రెసును శక్తిమంతం చెయ్యడానికి యెంతయినా కృషిచేశాడు. సర్. మిర్జా ఇస్మాయిల్ ప్రధానిగా వచ్చినప్పుడు, మంత్రివర్గంలో చేరి తనకు సహాయకారిగా ఉండమని అర్థించినప్పుడు తిరిగి, సంస్థానకాంగ్రెసు ఆదేశంలేనిదే తాను చేరననీ, ప్రభుత్వంలో జోక్యం కలగచేసుకోనని నిష్కర్షగా చెప్పాడు.

పదవీ వ్యామోహం యీయనకు కించిత్తుకూడా లేదనటానికి ఒకదృష్టాంతం చెప్పుకొంటే చాలును. 1943లో ద్వితీయ ప్రపంచసంగ్రామకాలంలో సంస్థానంలో యేర్పడినంగా రాంతిప్రదమయిన పరిస్థితుల్ని నెలకొలపాలని నిజామునిశ్చయించుకున్నాడు. అందుకు ప్రాతిపదికగా జనవిశ్వాసానికి పాత్రులయిన నాయకుల్ని తన మంత్రివర్గంలోకి తీసుకురావాలని ఆశపడి, కాంగ్రెసు అధిష్ఠానవర్గంతో సంప్రదింపులు ప్రారంభించాడు. అయిల్ హౌసు కెయిజర్, బహదూర్ యార్జంగ్, కమాల్ యార్జంగ్ వీరు మువ్వురు గాంధీజీ ఆమోదాన్ని అభిలషిస్తూ కొన్ని ప్రతిపాదనలను చేశారు. గాంధీజీ ఆప్రతిపాదనలను ఆమోదిస్తూ సంస్థాన నాయకులను మంత్రివర్గంలో చేరవలసిందిగా ఆదేశించాడు. అయితే ఒక్క షరతుమాత్రం ఆయన పెట్టాడు. మొత్తంమీద సంస్థాన పరిస్థితులు సవ్యంగా ఉన్న పక్షంలో మంత్రివర్గంలో తప్పక చేరవలసిందిగా నాయకులను మహాత్ముడు ఆదేశించాడు. అయితే శ్రీ రామకృష్ణరావు ప్రభృతులు గాంధీజీఆదేశాన్ని తిరస్కరిస్తూ తమతో సంప్రదించకుండా జరిగిన యీ రాయబారాన్ని తోసిపుచ్చారు.

ఈ విషయం చాలామందికి తెలియదు. అజ్ఞానంవల్లనూ, వ్యక్తిగతస్వభావంవల్లనూ రామకృష్ణారావుగారిని పదేపదే చింతాపకలి తూలనాడినవారు నేడు విచారిస్తున్నారు. తెలంగాణంలోని జనసామాన్యాన్ని సమైక్యపరిచి సర్వదా విశాలాంధ్ర నిర్మాణానికి పరిశ్రమిస్తున్న కొద్దిమంది తెలుగునాయకుల్లో రామకృష్ణరావుగారొకరు.

సాహిత్య క్షేత్రంలోకూడా ఆయన పేరు సంపాయించాడు. కవిత్వం రాయగలడు. తెలంగాణాలోని నవ్యసాహిత్యాభ్యుదయానికి పాటుపడ్డాడు. అయితే రాజకీయరంగంలో నిరంతరం నిమగ్నుడు కావటంవల్ల తగినంతగా సాహిత్యంలో కృషి చెయ్యలేకపోయాడు.

సర్వతోముఖమయిన ఆంధ్రసంస్కృతిని పునరుద్ధరించవలెనని ఆయన అనవరతం అభిలషిస్తాడు. ఇందుకు రాజకీయ కార్యకలాపాలను సాధనాలుగానే యెంచుతాడు. ప్రజాభ్యుదయమే ఏ ఉద్యమానికయినా చరమలక్ష్యమని ఉద్ఘోషిస్తాడు.

ఆయనకల నిజంకావాలని యీనాడు తెలంగాణా ఉవ్విళ్ళూరుతున్నది.

# ఆంధ్రరాష్ట్రము

## శ్రీ పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి

ఆంధ్రరాష్ట్రమునుగురించి తొలుత 1912 సం॥రం॥ మేనెలలో "నిడదవోలు" నందు జరిగిన కృష్ణా గుంటూరు జిల్లాల రాజకీయ మహాసభయందు అధ్యక్షులగు శ్రీ వేమవరపు రామదాసుపంతులుగారి ఎదుటను గుంటూరునందలి ‘దేశాభిమాని’ ప్రతికాధిపతులగు చేవగుప్తాపు శేషాచలరావుగారు, దేశభక్త, కొండా వెంకటప్పయ్యపంతులుగారు మొదలగువారితో నాలోచించి మద్రాసు రాష్ట్రమునందలి పన్నెండు తెనుగుజిల్లాలను ఏకరాష్ట్రముగా చేయవలెనను తీర్మానముపెట్టిరి.

కాని అదివరియగు తీర్మానముకాదని అధ్యక్షులు త్రోసివేసిరి. పిమ్మట ఆంధ్రరాష్ట్రమును ప్రత్యేకముగా చేయుటను గూర్చి పెక్కుతర్జనభర్జనలు పత్రికలయందును, సభలయందును జరిగెను. కాని 1913 వ సం॥రం శ్రీ "బయ్యావరసింహేశ్వరశర్మగారి" యధ్యక్షతను బాపట్లలో జరిగిన ప్రత్యేక ఆంధ్రమహాసభయందు ఆంధ్రరాష్ట్రము ప్రత్యేకముగా సంపాదించవలయునను తీర్మానము చేయబడెను. ప్రత్యేకాంధ్రరాష్ట్రమునుగురించి ప్రారంభమునుండి నేటివరకును శ్రీ కొండా వెంకటప్పయ్యపంతులుగారు నొక్కరితినే పట్టుదలను చూపుచున్నారు. ఇందుకు ఇప్పటి మనరాష్ట్రపతియగు డా॥ శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్యగారునూ వెంకటప్పయ్యగారితో సమానముగా పాటుపడిరి. ఆంధ్రరాష్ట్రపు ప్రత్యేకతను గూర్చి తొలుత మద్రాసు ఆంధ్రరాష్ట్రమున చేరవలయునను సమస్య పుట్టలేదు. ఇందులకు 1917 సం॥ర మే నెలలో నెల్లూరునందు శ్రీ ‘దేశభక్త’ కొండా వెంకటప్పయ్యపంతులుగారి యధ్యక్షతను జరిగిన యీ ఆంధ్రమహాసభయందలి తీర్మానములు, మహోపన్యాసములే నిదర్శనములు. పిమ్మటనే మద్రాసు ఆంధ్రరాష్ట్రమున చేరవలయునను సమస్య పుట్టినది. ఇందులకు పెద్దపెద్ద ఆంధ్రులను ప్లీడర్లు, మద్రాసు హైకోర్టునందు వకీళ్లనుట, మద్రాసు గవర్నమెంటునందు పెద్ద యుద్యోగులై పింఛను పుచ్చుకొనుచున్న ఆంధ్రోద్యోగులు మద్రాసును నివాసముగా నేర్పరచుకొనుటయే కారణము గాక దత్త మండలవాసులగు వాంధ్రులను, ఉత్తర సర్కారు నందలి యాంధ్రులపై తమ్మ, ప్రత్యేకాంధ్రరాష్ట్రము వచ్చిన యెడల యుద్యోగాదులలో నన్యాయమొక్కడు రను నను సమమునకు చే మద్రాసే మాకు రాజధానిగా నుండవలయునను కోరిక కూడా కారణమై యున్నది.

అందువలననే శ్రీ భోగరాజు పట్టాభి బదికజరిగి ఆంధ్రరాష్ట్రమునకు మద్రాసే రాజధానిగా నుండవలయునను సమస్య పుట్టినది. మద్రాసు ఆంధ్రులదే అను ఆగ్రహోద్యమము జరుగుచున్నది.

నిజమునకు మద్రాసు ప్రకాశము చంద్రగిరి యందలి విజయనగర సామ్రాజ్యపు చివరి ప్రభువులొక్క ప్రతినిధియగు చెన్నప్ప యనువానిని యధికారమునందు గల ప్రదేశమై, చిన్న పల్లెయై, ఆంగ్లేయుల కియ్యబడిన ప్రదేశమే! కాని దానికి చుట్టు నందు ప్రదేశము అరవ జనులతో కూడినదే. ఇప్పటికిని మద్రాసుకు ఉత్తరమున సుమారు యిరువది మైళ్ల దూరమువరకుగల గ్రామము లన్నియును అరవ జనులతో కూడినవే యని చెప్పక తప్పదు.

తొలుత శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులుగారు గాని, ఇప్పటి మన రాష్ట్రపతిగారుగాని మద్రాసు ఆంధ్రరాష్ట్రమున చేరవలయునను సంశయము తలంపని వారుగానే యుండిరని వారు కోరినాను యందు నేను విమర్శించి నిచ్చిన ప్రసంగముల వలననే తెలియుచున్నాను. ఆంధ్రరాష్ట్రము ప్రత్యేకింపబడిన యెడల దానికి రాజధాని ఎచ్చట నుండవలయును? ఆర్థిక సంపత్తి రాష్ట్రపరిపాలనమునకు తగిన రాబడియును కలదై యుండునా? అను సంశయములను గూర్చియే తొలుత ప్రశ్నింపబడుచుండెను. ఆర్థిక సంపత్తిని గూర్చి "ఆంధ్రోద్యమము" అను కరపత్రము బాపట్ల సమావేశానంతరము ఆంధ్రమహాసభా స్థాయి సంఘము వారు ప్రచురించిన దానిలో చివరకు మన మిత్రులగు శ్రీ గుగ్గిరాల ప్రకాశరావు గారు వ్రాసిన

10 వ పేజీ చూడుడు

# "ఆజాద్ పఖ్తూనిస్తాన్‌ను సాధించితీరుతాను" సరిహద్దుగాంధి గఫార్‌ఖాన్ శపథం

స్వతంత్ర పఠానిస్తాన్ స్థాపనే తన లక్ష్యమని, అవసరమైతే ఆ లక్ష్యసాధనకు తన ప్రాణాలనైనా అర్పిస్తానని సరిహద్దుగాంధి ఖాన్ అబ్దుల్ గఫర్‌ఖాన్ పాకిస్తాన్ కారాగారంనుండి పంపిన ఈ సందేశంలో స్పష్టంచేశారు. ఈసందేశాన్ని పుస్తులో ఒక కాబూలు పత్రిక ప్రకటింపగా, దాని ఆంగ్ల తర్జుమాను ఢిల్లీ వారపత్రిక ‘పీపుల్’ ప్రకటించింది. పఖ్తూనిస్తాన్ ఉద్యమం క్రమక్రమంగా బలపడుతూ ఉంది. ఈ పరిస్థితుల్లో ఖాన్‌అబ్దుల్‌గఫర్ గారు ఇందు నిమిత్తంచేసిన ప్రయత్నాలను తెలుసుకోవడం ఉచితం.

ప్రాచ్య ప్రజలసమితిలో స్వతంత్రసభ్యులుగా స్థానమలంకరించుటకు వీలుగనట్లు ఆఫ్ఘన్‌జాతిని పరరాజ్య ప్రాబాల్యము నుండి విముక్తిచేయుటే ఖుదైఖిద్మత్‌గారుల పవిత్రఉద్యమ మహోత్కృష్టమైన లక్ష్యం. ఖుదైఖిద్మత్‌గార్లను ప్రోత్సహించుచున్నది. దురాశ, స్వలాభాపేక్షగాదు. భగవదేచ్ఛ, జాతిక్షేమము కనుకనే నేను బాధలకు, అత్యాచారములకు కట్టుబడియుండును. మీ నిష్కళంకమైన సదుద్దేశములపైనను, భగవంతునిపైనను, నేను ఆధారపడియున్నాను. భగవంతుని నిర్ణయమును ఆమలుజరుపుటలో కృతార్థులమను కాగలమని నాకు దృఢమైన నమ్మకంగలదు. ప్రాపంచికశక్తి ఏదీ మాకు అడ్డుగ నిలువజాలదు. స్వతంత్ర పఖ్తూనిస్తాన్ అని వార్యము.

పఠానులను, పఖ్తూన్‌జాతిని విముక్తి చేయాలను ఈ ద్యమం క్రొత్తదిగాదు నూతనసమస్యగాదు. ఫిరింఘి స్వార్థపరత్వము మమ్ములను అనేక ముక్కలుగ చెక్కలు చేసిన నాటి నుండి ఈ సమస్య మనతో ఉంటూనే ఉంది. సరిహద్దు రాష్ట్రమునందలి, కొంత జాతుల ప్రాంతమునందున్న, బెలూచిస్తాన్, బాచిస్తాన్ కాలలో ఉంటున్న సోదర పఠానులందరు, అంతేగ నదీతీరాన ఉన్నవారిలో సహా ఒక్క సంఘంగా ఉండాలనే నాఅభిమతం. అందుకు కృషి చేయాలనే నా వాంఛ.

మొదటినుంచీ కూడా పఠానుల జాతీయొక్కతొసా,నక, వారి పరిస్థితిని చక్కచేయుటకే నేనూ, నా సంఘము కృషి చేస్తూ ఉన్నాము. ఈ నాటివరకూ ఈ లక్ష్య సాధనకు పాటుపడినాను. త్యాగాలు చేశాము. ఏగతిపొందినాసరే, ఏమకు లోపడకపోయినాసరే నా పఖ్తూన్‌జాతికి స్వతంత్ర పఖ్తూనిస్తాన్‌ను నిర్మించాలన్న నా నిర్ణయం అప్రతిహతం. నా బొందిలో ప్రాణంఉన్నంతవరకు ఇందుకోసం నేను కృషిచేస్తూనే ఉంటాను. ఈ ప్రయత్నంలో నా ప్రాణాన్ని అర్పించడానికి నైతం నేను సిద్ధంగా ఉన్నాను.

పఠానులత్యాగం వల్లనే పాకిస్తాన్, హిందుస్తాన్ స్వాతంత్ర్యాన్ని పొందినవి. బ్రిటిష్ ఆధిపత్యం తొలగుటకు భూస్థాపిత మైంది. భారత స్వాతంత్ర్య పోరాటములందు పఠానుల త్యాగం అపారమైనది. అపూర్వమైనది. అందుకే ఫిరంగీ పఠాన్ తనకు ప్రబల శత్రువని భావించి, అతన్ని సర్వనాశనం చేయాలని, అతని జన్మభూమిని పాకిస్తాన్‌లో కలిపివేశాడు.

పాకిస్తాన్ స్థాపనకు సంబంధించిన వివాదంలోకి దిగాలని నాకు లేదు. దాంతో నాకు సంబంధం లేదు. కాని తమ పితృభూమిలో ఆజాద్ పఖ్తూనిస్తాన్‌ను స్థాపించుకొనుటకు వారికి చెందిన హక్కుల సంపాదనకొరకు నేను పట్టుపట్టవలసిందే. పఠానులు చేసిన త్యాగమును గుర్తించి వారికి స్వాతంత్ర్యాన్ని ప్రసాదించవలసినదని జిన్నాను బ్రతిమాలుకున్నాను. బ్రిటిష్ వారికి గాని పాకిస్తాన్‌లో ఏ మాత్రం ప్రాబల్యం ఉన్న మేము పాకిస్తాన్ నుండి విడిపోవాల సుదృఢంగా పఖ్తూనిస్తాన్‌ను ఇవ్వవలసిందిగా జిన్నాను కోరినాను. అవసరమైతే పాకిస్తాన్‌తో కలిసి పని చేయడానికి మేము సిద్ధంగా ఉన్నామని జిన్నాకు స్పష్టంగా చెప్పాను. బ్రిటిష్ వారు పఠానుల స్వాతంత్ర్యాన్ని హరించినా వారంటే నాకు కష్టంలేదు. కారణం వారు మాకు



అజన్మశత్రువులు. కాని మీరు నేను సోదరులం. కనుక నాకు న్యాయంగారావలసినదాన్ని మీరు ఇస్తారనే నేను ఆశించుచున్నాను. ఈవిషయంగామీరు మాన్నే హాన్ని సంపాదించి రేపటి పాకిస్తానుకు బలాన్ని చేకూర్చిన వారవుతారు." అనినేను జిన్నాకు నచ్చచెప్పడానికి ప్రయత్నించాను, ఆశాభంగం చెందినాను.

ఆనాటి ఆనుమానాలు ఈనాడు స్పష్టపడినవి. యథార్థములవుచున్నవి. సరిహద్దు రాష్ట్రానికి గవర్నరుగా ఒక ఫిరంగి (ప్రిటిపర్) ని నియమించారు. అతను ఎలాంటివాడు? పఠానులను అణచివేయడంలో వారిలో ఆనైక్యతను ప్రోత్సహించడంలో ఆయనజీవితకాలమంతా పేరుపొందినవాడు. పఠానులయెడల ఆయన అనుసరించిన దారుణవిధానంవల్ల పఠానులకు ఆయన అంటే ఏమాత్రంగిట్టదు. రాజకీయపరిపాలనాశాఖలో ఉన్నవారు పఠానులుగాదు. అందులోఉన్న ఉద్యోగులుఅందరుకూడా బ్రిటిష్ విధానాన్ని బలపరచినవారే. ఇదేనా పాకిస్తాన్? ఇది ఇస్లాంమతమా? అలాగైతే పాకిస్తాన్‌కూడా బ్రిటిషువారి మదిరే పఠానులను ఇనపసంకెళ్లలో ఇరికించి ఉంచాలని వాంఛిస్తున్నట్లు స్పష్టమౌతున్నది.

పండిట్ జవహర్లాల్ సరిహద్దురాష్ట్రం వచ్చినపుడు, మిరాన్షాలోని పొలిటికల్ ఏజెంట్ నన్ను ఇలా అడిగాడు: "కోట్ల కొలది రూపాయలతో మేము పఠానులకు సేవచేస్తున్నాము. మీరు వారికి ఏం చేశారు?" ఆయన ప్రశ్నకు నేను ఇలా సమాధానం చెప్పాను: "నిజమే; వారిలో దురాశను ప్రోత్సహించడం, విభేదాలు కల్పించడం, వారి స్వాతంత్ర్యేచ్ఛ, వారి ఆత్మాభిమానం రద్దయిపోవునట్లు వారికి లంచాలు పెట్టడం, ఇవి మీరు పఠానులకు చేసిన గొప్పసేవ."

నేటి పాకిస్తాన్ బ్రిటిష్ సృష్టి. అందుకే అది నన్ను అణచివేసి, పఠానులపై అధికారం చెలాయించాలని చూస్తున్నది. ఇది ఇలా "జరుగకే దరసు" అనే నా నిర్ణయాన్ని ప్రకటిస్తున్నాను. నేను ఉద్దేశించిన కార్యక్రమాన్ని ఖుదైఖిద్మత్‌గార్లు అంటిపెట్టుకొని ఉన్నారు. ఈకార్య విధానాన్ని అనుసరించి నాప్రజలు గమ్యస్థానాన్ని చేరి స్వాతంత్ర్యాన్ని పొందగలుగుతారని నేను గట్టిగా నమ్ముతున్నాను. నేనుండేది సూర్యప్రకాశం ఉన్నాడు గనుక నావిజయం. శత్రు పరాజయం తధ్యమని అఖిల ప్రపంచానికీ నమ్మిస్తున్నాను.








The Planters Company, Ltd., Coonoor, Nilgiris, S. India.






ముద్రాపకప్రకాశకులు:- ఎం. ఎ. డలాల్. 100, నైనియప్పనాయక్ వీధి, జి. టి. మద్రాసు. కాక్ అండ్ కో, 2 తంబుచెట్టివీధి, మద్రాసు 1.



వెల్లింగ్టన్‌లో నిన్నటినుంచి ప్రదర్శితమవుతున్న కీర్తిస్తాన్ వారి "సింహార్"లో ఒక సన్నివేశం

# కామన్వెల్త్ భవిష్యత్తు

## బ్రిటిష్, ఐరిష్ పత్రికల వ్యాఖ్య

ఆసియా యూరపుల మధ్యబంధం లేకుండా పోయినట్లయితే రాగల అర్థశతాబ్దకాలములో ఈ రెండు ఖండాల మధ్య మారింతలుగా కష్టాలు ప్రాప్తించ గలవనీ, ఇండియాను కామన్వెల్తులో ఉంచడానికి తోడ్పడినవారు చిరస్మరణీయులుగా ఉంటారని "ట్రిబ్యూన్" అనే సోషలిస్టు వారపత్రిక వ్రాసింది.

* * *

కామన్వెల్తు సభ్యులు కోరబట్టే కామన్వెల్తు అనేది ఉందనీ, ఈ సమావేశంలో రిపబ్లికు వగైరా సమస్యలు చర్చించబడిన మాత్రాన కామన్వెల్తుకు విచ్ఛిత్తి కలుగబోదనీ, యుద్ధమూ, శాంతీ, స్వేచ్ఛా, ప్రజాస్వామికమూ మొదలైన విషయాల పై అధినివేశాలకు అభిప్రాయసామ్యం ఉండబట్టే ఇండియా, పాకిస్తాన, సింహళాలను ప్రేటను ఆహ్వానిస్తున్నదని న్యూస్ క్రానికల్ పత్రిక వ్రాసింది.

* * *

సమావేశంలో ఇండియా సమస్యపై నిరోగ్యకరంగా చర్చలు జరిగి, ఇండియా ప్రజలకూ, కామన్వెల్తు ప్రజలకూ, ఇతర ప్రపంచానికీ పనికి వచ్చే సూత్రం ఏర్పరచ బడాలనీ. భద్రత విషయంలోనూ వ్యాపార విషయంలోనూ ఇండియాకూ ఇతర అధినివేశాలకూ సమాన సంబంధాలుంటనీ, కామన్వెల్తురాజ్యాల రక్షణకు ప్రధానమైన నౌకా, స్థానిక బలాలే ఇండియా రక్షణకూ అధికంగా అవసరమనీ "లండను టైమ్సు" పత్రికా వ్రాసింది.

* * *

### ఐరిష్ పత్రికలు

పండిట్ నెహ్రూ బ్రిటిషు కామన్వెల్తువల్ల ఇండియాకు గల లాభాలన్నీ సమర్థించినవాడనీ, రిపబ్లికులకు కామన్వెల్తులో స్థానం లేదని చెప్పినమాట బేఖాతరైనప్పటికీ, ప్రతిఘటనకు అవసరం కలిగినప్పుడు మాతృదేశానికి విరుద్ధంగా వ్యవహరించే శక్తిగల వారనీ, కామన్వెల్తులో ఏ సమానస్థానం ఉంటుందనీ "ఐరిష్ టైమ్సు" పత్రిక సంపాదకీయం వ్రాసింది.

"ఐరిష్ ఇండిపెండెంటు" అనే మరొక పత్రిక సంపాదకీయంలో, ఇండియా కామన్వెల్తులో ఉండటం గురించి స్పష్టంగా ఆమోదించకపోయినా ప్రకటన, ఇతరదేశాలు అత్యంతశ్రద్ధ చెప్పలేదని వ్రాసింది.

## నగరంలో సినిమాలు

| | |
|---|---|
| సాగర్ | 'హో భాయ్' |
| వెల్లింగ్టన్ | 'సింహార్' |
| స్టార్ | 'నల్లతంబి' |
| పారగన్, క్రౌన్ | 'వేలైక్కారి' |
| ప్రభాత్, సరస్వతి, సన్ | 'పసలకొండడి' |
| బ్రాడ్వే | 'దేవర్' |
| సినిమా సెంట్రల్ | 'స్వర్గసీమ' |
| సెలెక్టు | 'హుమయూన్' |

Casino: 'Kiss the Blood off My Hands'

Minerva: 'White Savage'

New Elphinstone: 'The Walls of Jericho'

New Globe: 'One Sunday Afternoon'

Roxy: 'Unconquered'

## కేంద్ర ఫిలింసెన్సార్ బోర్డు

### ఆవశ్యకతగూర్చి శ్రీ దివాకర్ ఉపన్యాసము

మదరాసు, ఏప్రిల్ 22: ఫిలిముల పరిశీలనకు కేంద్ర సెన్సార్‌షిప్‌కు సంబంధించినబిల్లు తయారగుచున్నది. బిల్లుతయారు కాగానే కేంద్ర సెన్సార్ బోర్డు నిర్మాణమునకు సంబంధించిన వివరములు పరిశీలించబడుతుంది అని కేంద్రప్రభుత్వ బ్రాడ్‌కాస్టింగ్ అండ్ ఇన్‌ఫర్మేషన్ ఉపమంత్రి శ్రీ ఆర్. ఆర్. దివాకర్ చిత్రా టాకీస్‌లో సినీ టెక్నీషియనుల సంఘములో మాట్లాడుచు చెప్పిరి.

ఇండియా ప్రభుత్వమువారు ఏర్పరచనున్న ఫిలింపరిశ్రమ పరిశీలన సంఘంవారు ఫిలింపరిశ్రమగూర్చి సమగ్రవిచారణ జరుపగలరు. అని శ్రీ దివాకర్ అనిరి.

అధ్యక్షులు శ్రీ యల్. వి. ప్రసాద్ మాట్లాడుచూ ప్రభుత్వము ఫిలింపరిశ్రమను గురించి ప్రత్యేకశ్రద్ధ తీసుకొనుచున్నందుకు కృతజ్ఞత తెలిపిరి.

శ్రీ కె. సుబ్రహ్మణ్యం ఉపమంత్రి శ్రీ దివాకర్‌కు స్వాగతమిచ్చిరి.

గౌరవకార్యదర్శి శ్రీ యస్. కృష్ణస్వామి అభినందనలు తెలిపిరి.

శ్రీ దివాకర్ నిన్న వుదయం కలకత్తా నుండి వచ్చినప్పుడు విమానాశ్రయములో ఆక్టింగ్ డైరెక్టరు ఆఫ్ ఇన్‌ఫర్మేషన్ శ్రీ కె. విలియమ్స్, ఆలిండియా రేడియో ప్రతినిధులు ప్రభుత్వోద్యోగులు స్వాగతమిచ్చిరి.

## భారత ఎయిరోక్లబ్

### అధ్యక్షుడుగా నెహ్రూ ఎన్నిక

న్యూఢిల్లీ, ఏప్రిల్ 21: భారత ఎయిరోక్లబ్బు పండిట్ నెహ్రూ అధ్యక్షుడుగాను, పండిట్ హృదయనాథ్ కుంజ్రూ ఉపాధ్యక్షునిగాను ఎన్నుకోబడ్డారు. మానేజింగు కౌన్సిలుకు ఎన్నుకోబడిన వారిలో సర్ సుల్తాన్ అహమద్, సర్ ఉషానాథ సేన్, ఎయిర్ మార్షల్ ఎల్మ్‌హర్స్ట్, ఎస్. ముఖర్జీ, హెచ్. కె. మహాతాబ్, డి. గోష్. ఉన్నకటి, సెంక్లేర్, జి. సుబ్రహ్మణ్యంగార్లు కూడ కలరు.





రస్తాల పక్కనవుండే పొదలను, గట్టలను శుభ్రంచేసి నేలను చదును చేయడానికి ఉపయోగపడే "ట్రాక్టర్" లాంటి ఒక కొత్త యంత్రం.

# తోటలకు, వ్యవసాయ క్షేత్రాలకు కొత్తసాధన సంపత్తి

ప్రపంచములోకెల్ల అతి పురాతనమైన పరిశ్రమ వ్యవసాయమే. ఇట్టి వ్యవసాయమునకు ఆధునిక యంత్రసాధనములను ఉపయోగించవలసి యున్నది. గనుక, బ్రిటిష్ పరిశ్రమల ప్రదర్శనములో పొలాలకు తోటలకు పనికివచ్చేడి పనిముట్ల ప్రదర్శనము ప్రధానభాగమై యున్నది. పాడి పరిశ్రమకు కావలసిన పనిముట్లు, పాలుమధించే పనిముట్లు, పశువులసాకడికి కావలసిన పరికరములు, వ్యవసాయదారుకు అక్కరకువచ్చే యితర సాధన సంపత్తి ఆ సంతలో ప్రదర్శింపబడును.

అల్యూమినియం సక్రమలో హాంతో అతి తేలికదైన రేకులతో నిర్మింపబడిన యింట్లను అక్కడ చూడవచ్చును. అంత తేలికదైన రేకులుకూడ ఉక్కువలెగట్టిగా ఉండును. బర్మింగుహాం షైగులోని ఫారన్ హాం రాయల్ వద్దనున్న ఆక్మిన్ లిమిటెడ్ కంపెనీ వారిచే యీ అల్యూమినియం గృహములు నిర్మింపబడుచున్నవి. ఎటువంటి శీతోష్ణస్థితిలోనైనను యీ భవనములు దివ్యముగా అక్కరకు రాగలవు. వ్యవసాయ సంబంధమైన పరికరములకు అక్కరకు వచ్చేడి కొత్త రకపు మిశ్ర లోహముల రకములు కొన్ని యీ ప్రదర్శనములో చూడనగును, రీడింగు నగరములో కెర్సీ లీ అవెన్యూ వద్ద గాస్కోయిన్ హవుసు నందున్న గాస్కోయిన్ లిమిటెడ్ కంపెనీవారు పాలు పితికెడి కొత్త సాధనములను యీ ప్రదర్శనములో ప్రదర్శించుచున్నారు. రైతుకు అక్కరకు వచ్చేడి ఆధునిక సాధనపరి పరికరము లెట్లుండ గలవో యీ ప్రదర్శనముల్ల విశదం కాగలదు.

పండిన పంటను ఎండబెట్టుటకు ఆరబెట్టుటకు బదులు గా యంత్రసాధన దానిలోని తడిని చెమ్మను తీసివేయవచ్చును. ఈ యంత్రసాధనములు బర్మింగుహాంలోను రిపి, వీమను పీఫిలోని పెడ్లు అండ్ అసెంబ్లీ లిమిటెడ్‌వారిచే తయారుచేయబడెను. ఈ యంత్రసామగ్రిని స్థిరంగా ఒకచోట ఉంచవచ్చును. లేదా కోరిన స్థలమునకు తీసికొని పోవచ్చును. పెరటిలోని పూలతోటలకు ఉద్యానవనములకు అక్కరకురాగల మోటారు నాగళ్లు లింకను షైరులో గ్రాంథాంనందు చార్ ఫోర్డు (లిమిటెడ) తయారు చేయబడినవి. ఈ చిన్నసైజు ట్రాక్టరులకు సులభంగా తగిలించుటకు వీలైన యంత్రసాధనములు కొన్ని కలవు. వాటిని తగిలించుటవల్ల నేలదున్నవచ్చును. గట్లు వేయవచ్చును కంచెలను కత్తిరించవచ్చును.

### శీతల మందిరములు

లండనులోని కింగ్స్‌వేయందున్న ఆఫ్రికా హవుసులోగల బి. బి. సి. ఇండస్ట్రీయలు కన్‌స్ట్రక్షన్స్ లిమిటెడ్ వారిచే తయారుచేయబడిన యంత్రములు యీ ప్రదర్శనములో కలవు. చల్లని గాలి గదులలో ప్రసరించునట్లు చేయుటకును శీతోష్ణములను నిగ్రహించుటకును యీ యంత్రములు అక్కరకురాగలవు. ఈ కాలములో ఆహార పదార్థముల ఉత్పత్తియందు శీతల కరణ యంత్ర సాధనములు చాలా ముఖ్యమైనవి. ఆప్సు ఫర్డు, కాలీ, లోని ప్రెస్టో స్టీలు కంపెనీ లిమిటెడ్ వారి (ప్రెస్టు కోల్డు రిఫ్రిజిరేషను) వారి యంత్రములు యీ ప్రదర్శనములో కలవు. మలాము వేయబడిన పండాలు, టాంకులు, మంచినీటి లోట్లు ఇచట ప్రదర్శింపబడును. యార్క్ షైరులో షిప్లీ టాంకు వర్క్సు, డబ్ల్యు పి. బట్లరు ఫీల్డు కంపెనీ వారిచే తయారుచేయబడినవి. పెట్రోలు వగైరాలకు ఉపయోగపడు టాంకులుకూడా కలవు. పెట్రోలు ఇంజనులను పారఫిను ఇంజనులు ప్రోవెట్ లింస్లే లిమిటెడ్, లెచ్‌వర్త్, హెర్టుఫర్డుషైరు వారిచే తయారుచేయబడినవి కలవు. ఇవి విద్యుచ్ఛక్తి యంత్రములను నడిపించుటకు అక్కరకు వచ్చును.

దూరంగామారుమూల ప్రాంతములో నివసించెడివారికి మోటారు ట్రక్కులు, ట్రక్కుల శ్రేణులు వగైరా శకటములు కావలసి యుండును.

## ఏ. థామస్ గిల్లింగ్

ఆట్టివి అనేక రకములైనవి ఎక్కల్సు (బర్మింగుహాం) లిమిటెడ్, హాజెల్వెల్, నమ్మస్టిర్చలీ, బర్మింగుహాం కంపెనీవారు తయారుచేసినవి కలవు. అవి ఖండాంతర దేశాలకు పంపుటకు వీలైనవి. ఎకానమిక్ వాటరు సాఫ్టెనర్సు లిమిటెడ్, అక్వా వర్క్సు వాల్‌విక్ రోడ్డు, సైసెలీ, బర్మింగుహాం కంపెనీవారు మందమైన నీరును విరుచటకును తేలికనీరుగా చేయుటకును కొంతసాధన పరికరములను తయారు చేసిరి. నీటినితోడే పంపులు స్థిరంగా ఉండేవిగాని, కోరిన చోట్లకు తీసికొనిపోదగినవిగాని, యోనో పంప్సు లిమిటెడ్, మోన్‌హవుస్, క్లెర్కెన్‌వెల్ రోడ్డు లండను, ఇ సి-1 వారిచే తయారు చేయబడినవి కలవు.

### ఉక్కుషెడ్డులు గాదెలు

గడ్డి నిల్వచేయుటకు ధాన్యం నిల్వచేయుటకు ఉక్కుతోచేయబడిన గాదెలు అనేకరకాలు జాన్ ఎల్వెల్ లిమిటెడ్, ఓల్డుబరీ, వూస్టరుషైరు, వారిచేతను ఫెలోక్సు హాయిస్టు లిమిటెడ్, 17 విక్టోరియా వీధి, లండను. యస్. డబ్ల్యు. వారిచేతను తయారుచేయబడినవి కలవు. ఈ గాదెలను బిగించుటకు తగిన సహాయిక్టులుకూడ తయారుచేయబడినవి.

పొలాలకుచుట్టూ కోరడి వేయుటకు స్తంభములు కావలెను. ఆ స్తంభములను తగినసైజుకు కోయుటకు యంత్రపు రంపము భద్రమైనది, సులభంగా వెంటతీసికొని పోదగినది. యంగ్‌లియాకో నెక్ లిమిటెడ్, 30 వార్ఫ్ రోడ్ వీధి, లండను డబ్ల్యు సి. 2 కంపెనీవారిచే తయారు చేయబడినవి యీ ప్రదర్శనంలో చూడనగును. ఈ రంపపుయంత్రమును ఒక మోటారు ట్రాక్టరుకు వెనుక తగిలించి తీసికొనిపోవచ్చును. ఈ యంత్రం రంపమునకు అనువుగ రబ్బరు టైరుచక్రములు కలవు. దీనితో ఎటువంటి దుంగలనైనను స్తంభలుముగా కోయవచ్చును.

### సరకులను ఎత్తేయంత్రాలు

పెట్టెలు బస్తాలు పైకివెత్తి బండ్లలో ఎక్కించుటకుగాని పేక్ రూటు సంపలను త్రవ్వుటకును, బ్రిటిష్ పారిశ్రామికులు అనేకరకములైన ఉద్ధరణయంత్రములను తయారుచేసిరి. ఇవి చక్రాలబండిమీద పెంచియుండుటవల్ల కోరినచోవుకు తీసికొనిపోవచ్చును. సాలోపియన్ ఇంజనీర్లు లిమిటెడ్, శ్రేస్, విట్‌చర్చి, ష్రాఫ్‌షైరు అను కంపెనీవారిచే యివి తయారు చేయబడినవి. పశువుల కొట్టములను బిగించుటకు ఇనుపకొట్టాల కట్టములకూడా వారు తయారుచేసిరి.

పెట్రోలుఇంజన్లు వేడి ఎక్కకుండా గాలి తిరుగుటద్వారా చల్లబడగలినవి, పొలాల పనులకు అక్కరకువచ్చే యింజన్లు. విల్లీర్సు ఇంజనీరింగ కంపెనీ లిమిటెడ్, మార్స్టటన్‌రోడ్డు, వుల్వరాహాంపుటన వారిచేత తయారు చేయబడినవి. అరహార్సు పవరు మొదలుకొని 4 హార్సుపవరుశక్తిగల ఇంజనులు ఇవి అవి ఏఏ పనులకు ఉపయోగపడగలవో చూపబడును.

యార్డ్లీ వేవిన్ లిమిటెడ్ సెయింటు జాలియన్సు ఫయర్సు, సైడ్‌కోప్, ట్రూస్ బరీవారలే తయారు చేయబడిన విద్యుదుత్పత్తి యంత్రములు పెద్దవికలవు. వీటిని నడిపించుటకు భారీ పెట్రోలు ఇంజను, పారఫిను ఇంజను, డీసెలు ఇంజన్లుకలవు.

సుత్తెలు, రెంచీలు, వగైరా పనిముట్లు అనేకము అదింగుపను కింగ ఉక్కు లిమిటెడ్, టాంప్లేను స్ట్రీటు అండ్ విలియం స్ట్రీటు, రగ్బీవారిచే తయారు చేయబడినవి కలవు. పశువులను వధించుటకు మంచి యంత్రసాధనములు కలవు. ఇవి ఆకిల్సు అండ్ పోలకు లిమిటెడ్ ఓల్డుబరీ, బర్మింగుహాం వారిచే తయారు చేయబడినవి.

### విమానాలనుండి పొలాల పరిశీలన

పెద్ద పెద్ద ఎస్టేట్ల భూములను విమానం మీదనుండి పరిశీలన చేయవచ్చు. అందుకై ఫోటోలను విమానంమీదనుండి తీయవచ్చు. ఏరోఫిల్మ్స్ లిమిటెడ్ 24, ఓల్డుబాండు స్ట్రీటు, లండనువారు ఈ విమాన పరిశీలన సాధనములను చూపించెదరు.

విద్యుచ్ఛక్తిగాని గ్యాసుగాని లభింపని చోట్ల తుపానుగాలికి చలింపని దీపములను ఉపయోగించవచ్చును. అల్లాడ్దీను ఇండస్ట్రీసు లిమిటెడ్ అల్లాడ్దీను బిల్డింగు, గ్రీనుఫోర్డు, మిడిల్‌సెక్సు అనే కంపెనీ యీ లాంతర్లు తయారుచేసింది.

పెద్దతోటలకు జరీబులకు అక్కడకు వచ్చేడి ట్రక్కులు కార్లు వబ్లియు, జి. ఆలెన్, అండ్ సన్సు, (టిప్టను) లిమిటెడ్, ప్రిన్సెస్ ఎండ్ వర్క్సు, టిప్టను, స్టాఫర్డుషైరువారిచే తయారు చేయబడినవి కలవు.

కాయ్రద్రవ్యాలను ఇతర పంటసరకుల లోను చెమ్మయెంతవరకు కలదో శోధించి తెలిసికొనుటకు తగిన సాధనములను థామస్ ఆప్‌వర్తు అండ్ కంపెనీ లిమిటెడ్ వల్కనువర్క్సు, రోజ్, గ్రోవ్, బర్న్లీ వారిచే తయారుచేయబడెను.

చేతిపనిముట్లు సుత్తి దిమ్మలు, వగైరాలు యీక్రింది మూడుకంపెనీలచే తయారు చేయబడినవి కలవు. అట్కిన్సను బ్రదర్సు లిమిటెడ్ మోబ్రేస్ట్రీటు, షెఫీల్డు (2) జే. బ్రాకుహవుస్ అండ్ కంపెనీ లిమిటెడ్, విక్టోరియావర్క్సు, హీత్‌టౌను, వెస్టుబ్రోంవిచ్, స్టాఫర్డుషైరు, (3) జాన్ బ్రూక్సు (లిమిటెడ్) విక్టోరియావర్క్సు హీత్‌టౌన్ వెస్టుబ్రోయేమిచ్, స్టాఫర్డుషైరు.

విద్యుచ్ఛక్తి లభించెడి ఊళ్లకై అర్థపావు హార్సుపవరుగల ఎలెక్ట్రిక్కు మోటార్లు చాలా అక్కరకు రాగలవు. ఇట్టి చిన్న మోటారు యంత్రములు, అనేక రకములు బ్రూకుమోటార్సు లిమిటెడ్, ఎంపైర్‌వర్క్సు, హడ్డర్సుఫీల్డు, కంపెనీలు తయారుచేసిరి. విద్యుచ్ఛక్తి కత్తెరలు, క్లిప్పర్సు కంపెనీ లిమిటెడ్ ఎలెక్ట్రిక్కు ఎవెన్యూ విట్టన్ బర్మింగుహాం, కంపెనీచే తయారుచేయబడిన).

### తేనెటీగల పరిశ్రమ

బర్గ అండు సన్సు గ్లౌస్టరు వారిచే తేనెటీగల గూండ్లను కల్పించెడి సాధనములు చాలా తయారు చేయబడినవి. తోటలుగల అల్యూమినియంలో చేయబడిన తోటల చప్పరములు మందిరములు అనేకము చేజ్ ప్రొటెక్టివ్ కల్టివేషను చెర్ట్సీ సర్రే, కంపెనీ తయారుచేసెను. కార్టుజెటు లిమిటెడ్ హైనా వర్క్సు ఓల్డుహాం, కంపెనీవారు అట్టి మందిరములను పూసిరంపలు మంచి) తయారు చేసిరి. ఎలెక్ట్రిక్కు బ్యాటరీలు చాలా దూర ప్రాంతాలకు కావాలి కోరైజ్ ఎలెక్ట్రికలు స్టోరేజి కంపెనీ లిమిటెడ్, ఎక్సైడ్ వర్క్సు క్లిఫ్టను జంక్షను, మాంచెస్టరు వద్ద లభించును. దీనిలో చాలా చిన్న బ్యాటరీలు కూడా దూరాశ్రవణ యంత్రములు వగైరాలకు కావలసినవి కలవు.

ఎండుగడ్డి ముక్కలుగా కోసుటకు చొప్పదంట్లు నరకుటకు క్రిస్టీ అండ్ నారిస్ లిమిటెడ్, వాక్ సిట్ ట్రేవాక్, కెన్సింగుటను, లండను తయారు చేసిన యంత్రములు కలవు. ఇండ్లను పైన వేయుటకు పెంకులు డబ్లియు, హెచ్. కోల్సు, (లండను) లిమిటెడ్ సర్బిటను, సర్రే కంపెనీవారివి కలవు. సిమెంటు కాంక్రీటు యిటుకలు కూడా కలవు.

బ్రిటిష్ పరిశ్రమల ప్రదర్శనం లండనులోను బర్మింగుహాం నగరంలోను ఏకకాలమందే అనగా మే నెల 2 మొదలు 13 వరకు జరుగును. అనేక కారణాలవల్ల ఇది ముఖ్యంగా నంపెదగిన ప్రదర్శనం. ఇంగ్లండులో వస్తుసామగ్రుల ఉత్పత్తి తక్కువైనది. కాని ఫ్యాక్టరీల యజమానులు పనివాండ్లు కలిసి కష్టించి ఉత్పత్తి హెచ్చించిరి. ఇప్పుడు కోరిన యంత్రసామగ్రులను సరకులను డెలివరు చేయగల స్థితికి ఇంగ్లాండు వచ్చినది.



మద్రాసు అడ్వకేట్స్ అసోసియేషను రజతోత్సవ సందర్భమున భారతప్రధాన న్యాయమూర్తి హీరాలాల్ కనియాగారు ఉపన్యసించుచూ ఉన్న దృశ్యం.



అర్జంటీనాకు భారతరాయబారిగా నియమింపబడిన జె. వేసుగర్, ఆయన సతీమణి

# ఆంధ్రరాష్ట్రము

(9-వ పేజీ తరువాయి)

యాంశముగా ఆర్థికసంపత్తి యొక్క సంశయము నిర్ణయింపబడుచున్నది. కానీ రాజధాని ఎచ్చట?

ఆంధ్రరాష్ట్రమునకు రాజధాని ఎచ్చట నుండవలయును? దానిని నూర్చిన వచ్చలకు తమ పత్రికలో తాసెంబరులో శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు గారు ఒక ప్రశ్న ఆంధ్రపత్రికలో ప్రకటింపగా పెక్కండ్రు పెక్కు విధముల వ్యాసములను ఆంధ్రపత్రికకు పంపిరి. అప్పటికింకా ఆంధ్రా యూనివర్సిటీ బయలుపడలేదు. ఆ వ్యాసకర్తలలో శేషగిరావు రెండు వ్యాసముల వ్రాసిరి. అప్పటి వాదము ఆంధ్రా యూనివర్సిటీకిని, రాజధానికిని విశాఖపట్టణమే ముఖ్యస్థానముగానుండ దగినదని.

అప్పటి వ్యాసములలో విచిత్రమేమనగా పెద్దపురము రాజధానిగా నుండవలెనని ఒకరును, మార్కాపురం రాజధానిగా నుండదగినదని మరియొకరును వ్రాసిన వ్యాసములై యున్నవి. కాని పురాణము సూరి శాస్త్రి బి. ఎ. గారు ప్లానులతో గూడ బెజవాడ ఆంధ్రరాష్ట్రమునకు రాజధానిగా నుండదగినదని వ్రాసిన వ్యాసము శ్రేష్ఠమై యున్నది.

ఇంకొకప్పుడు శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య ఎం. ఎ. గారు హైదరాబాదు "ఆంధ్రులకు ముఖ్య పట్టణము, అని ఎక్కడనో ఉపన్యాసమిచ్చిన సంగతి జ్ఞప్తికి వచ్చుచున్నది. నిజమునకు హైదరాబాద్ మద్రాసునకువలె గాక, ఆంధ్రదేశమునకు పూర్తిగ చేరిన పట్టణమే అయియున్నది.

"ఆంధ్రరాష్ట్రమునకు రాజధాని ఏది?" అను సంశయమునుగూర్చిన వ్యాసమాంధ్రపత్రికలో 1920, 21 సంవత్సరములలో వెలువడియుండెను. ఆంధ్రుల ప్రదేశమే మద్రాసు అనుచో శ్రీ కృష్ణదేవరాయల మనుమడు వేంకటపతిరాయలచే కట్టబడిన "రాయవేలూరు" ఏల ఆంధ్రరాష్ట్రమున చేరరాదు? వేలూరునకు చుట్టుప్రక్కల చాలపల్లెలు ఆంధ్రులతో నిండియుండినవే యని నేను సంచరించి తెలిసికొంటని.

మద్రాసునందుంచుమింపుగా సగము వరకు ఆంధ్రులుండినమాట సత్యమే. కానీ దానిని వదులుకొనునంతమాత్రమున వేగముగా నాంధ్రరాష్ట్రము సిద్ధించునని మన రాష్ట్రపతిగారు చెప్పుచుండగా మనమేల మద్రాసునకై పట్టుపట్టవలయును? నాకు జూడ ద్వితీయ ప్రపంచ యుద్ధమునకు కారణమై జర్మనులు హెచ్చుగనుండె "పోలండు"నకు చేరైన "డాంజిగ్"నకై హిట్లరు పట్టుపట్టినట్టు గాక మనమూ ప్రత్యేకాంధ్ర రాష్ట్రమునకై ప్రయత్నింతము గాక! భవిష్యత్తునందు తెలంగాణా ఆంధ్రులు మనమూ ఏకమై హైదరాబాద్‌ను మనకు చేర్చుకుందుము గాక! మహాంధ్రమున నింకను మధ్యరాష్ట్రముల లోని చాందా మొదలగు ప్రదేశములును, మైసూరురాజ్యమునందలి "కోలారు" జిల్లా, బెంగుళూరుజిల్లాలోని విస్తారభాగము చేరవలసియున్నది. ఉత్కలములోని పర్లాకిమిడి మొదలగు ప్రదేశములుకూడ చేరవలయును. కానీ ప్రస్తుతము రాష్ట్రపతి చెప్పిన చొప్పున నేడిచో యొక రూపమున ఆంధ్రరాష్ట్రము మనము పొందవలసియున్నది. మనకు మద్రాసు చేరకుండినయెడల రాష్ట్రము సిద్ధించునను నంశము మహారాజకీయ వేత్తయూ, తాము ప్రధాన మంత్రులుగా నుండినప్పు డాంధ్రులపై శీతకన్ను వేయుచుండిన శ్రీ సీ. రాజగోపాలాచారిగారు ఇప్పుడు గవర్నరు జనరలుగా నుండుట కారణమేమోయని కొందరు తలంచుచున్నారు. ఏమో? ఈ దేవరహస్య మెవరికి తెలియును?






Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St. Madras